LONGEST LIVING NEWSPAPER IN TELUGU JOURNALISM    Visit Internet Edition @ www.zaminryot.com "e-mail : editor@zaminryot.com"

# జమీన్ రైతు



స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు    సంపుటి : 71    సంచిక : 48    1.12.2000    శుక్రవారం    12 పేజీలు    విడిప్రతి : రూ.2.00లు    జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి

# పంచాయతీల ఉచ్చు తప్పదా?

ముందు నుయ్యి, వెనుక గొయ్యి - అన్నట్లుంది ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు పరిస్థితి; మార్చి 31తేది లోపల పంచాయతీ ఎన్నికలు జరిపి తీరాలని సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పు వ్యక్తిగతంగా చంద్రబాబుకు, రాజకీయంగా తెలుగుదేశం పార్టీకి పెను ప్రమాదం తెచ్చి పెట్టింది. ఎప్పుడో ఒకప్పుడు ఈ తీర్పు రాకమానదు, ఎన్నికలు జరిపించకా తప్పదు అనుకొంటున్నదే; కాని అది ఇంత హఠాత్తుగా, ఉరుములేని పిడుగు వలె వచ్చిపైన పడుతుందని మాత్రం వూహించలేదు.

ఇప్పుడు ఎన్నికలు జరిపి తీరాలి. కాని రాష్ట్రంలో ఎన్నికలు జరిపే వాతావరణం ఎంత మాత్రం లేదు. ఓట్ల కోసం గ్రామాలకు వెళ్తే రాళ్లతో తరిమి తరిమి కొట్టేట్లున్నారు రైతులు. కరెంట్ ఛార్జీల పెంపకం, కరెంటు సరఫరా లోపాలు వారి కడుపులో చిచ్చు రగిల్చాయి. పండిన పంటను అమ్ముకోను గతిలేని దుర్గతి ఏర్పడడంతో ఆ చిచ్చు కార్చిచ్చువలె వ్యాపించింది. తాకితే పేలిపోయే బాంబువలె, కదిలిస్తే బ్రద్దలయ్యే అగ్నిపర్వతం వలె వున్నాయి రైతాంగం హృదయాలు ఇప్పుడు. మెడమీద తల వున్నవాడెవ్వడూ వారిని ఓట్లడిగే తెలివి తక్కువ పని చేయలేడు. ఇటువంటి ప్రజాగ్రహాలెప్పుడూ ప్రభుత్వాన్ని నడిపే వారిపైకే మళ్లుతుంటాయి. ఇంతటి పాపభారం తలకెత్తుకొని వున్న చంద్రబాబుకు ఎన్నికలు జరిపి తీరవలసిన అగత్యం ఏర్పడడం కంటే ప్రారబ్దం వేరొకటి వుండదు.

అట్లని వాటిని వాయిదావేద్దామా అంటే అది రాజ్యాంగ సంక్షోభానికి దారితీస్తుంది. శివాజ్ఞనైనా ధిక్కరించ వచ్చుకాని, సుప్రీంకోర్టు తీర్పును నిర్లక్ష్యం చేయడానికి లేదు. ఎన్నికలు జరిపితే జనం కసి తీర్చుకొంటారన్న భయం;

తరువ 12వ పేజీలో

## మంత్రుల అవినీతికి ఆమోద ముద్ర!

కాలు జారితే వెనక్కు తీసుకోవచ్చుకాని, నోరు జారితే ప్రమాదం. కాని గత నెల రోజులుగా తెలుగుదేశం మంత్రులు, ముఖ్యమంత్రి సైతం అదే పని చేస్తున్నారు. ముందు నోటికి ఏది వస్తే అది వాగేయడం; ఆ తర్వాత నాలుక కరుచుకోవడం మామూలై పోయింది. కరెంట్ సమస్యతో మొదలైంది దరువు. ఒకరితో ఒకరు పోటీలు పడి అబద్ధాలు పలికారు. కరెంట్ కోత లేదని ఒకాయన ఢంకా భజాయించి వాయిస్తే - కేవలం నాలుగు గంటలే కోత అని ఇంకొకాయన బల్లగుద్ది వాదించాడు. కరెంట్ లేక పైర్లు ఎండిపోయాయి అని పత్రికా విలేఖర్లు స్వయంగా చూసి వచ్చి మరీ చెప్తే - అదేమైనా కాంగ్రెస్ నేత రోశయ్య బోడి నెత్తా మాడిపోవడానికి అని ఒక మంత్రివర్యులు గేలి చేశారు. కరెంట్ ఎన్ని గంటలు వస్తున్నదో, ఎన్ని గంటలు రావడం లేదో మంత్రులు, కాంగ్రెస్ నేతలు చెప్పనవసరం లేదు; పత్రికలు వ్రాయనవసరం లేదు; ఆ బాధలు పడే జనానికి అది బాగా తెలుసు. ఇంట్లో దీపం వెలిగేది, ఆరేది; చేలో మోటారు తిరిగేది, లేనిదీ ఒకరొచ్చి చెప్పాలా? కరెంట్ విషయంలో రాష్ట్ర ప్రభుత్వ అసమర్థత ప్రజల పాలిట శాపంగా మారుతున్నది.

తరువ 12వ పేజీలో

# ఎస్పీ బదలీ పుకారు దగాకోర్ల పనే

నెల్లూరు జిల్లా పోలీసు సూపరింటెండెంట్ శ్రీనివాసరెడ్డిని బదలీ చేయిస్తున్నారన్న పుకార్లు సియిలో కార్లకంటే స్పీడుగా షికార్లు చేస్తున్నాయి. మొన్నొక రోజు ఏదో పని మీద ఆయన హైదరాబాదుకు వెళ్తే - ఇదే ఆఖరు. ఇక తిరిగిరాడు అని టౌనంతా పూదరగొట్టేశారు కొందరు పోలీసులు. గ్రీన్‌గ్లోరి దగాకోరులకు ఎస్పి గారంటే కడుపుమంటగా వుంది; కళ్లలో నిప్పులు పోసుకొంటున్నారు.

అది సహజమే. ఒక పోలీసు అధికారి, తన శాఖలోని ఇతర అధికారుల అవినీతి బయటపెట్టడానికి సాహసించడం ఒక అపురూప సంఘటన. దాన్ని వలసిన ఈ పాపకృత్యం పట్ల ప్రభుత్వం పట్టీ పట్టనట్లు వ్యవహరించడమే అసహ్యంగా వుంది. గ్రీన్‌గ్లోరి మోసం బయటపడి మూడు నెలలు గడిచిపోయాయి; అందులో పోలీసుల ప్రమేయం రుజావులతో సహా దొరికిపోయి రెండు వారాలు గడిచాయి. కాని ఒక్క ప్రభుత్వ నేత, హోంమంత్రి, ఒక్క ఉన్నతాధికారి దీనిపై చలించడం లేదు. సత్పరిపాలన, సత్సంబంధాలపై ప్రతిరోజూ టెలికాన్ఫరెన్సులు, వీడియో కాన్ఫరెన్సులు జరిపే ముఖ్యమంత్రి సైతం చెవులు, కళ్లు మూసేసుకున్నాడు.

ఈ దగా కోరు తనంలో కీలకపాత్ర నిర్వహించిన పాత ఎస్పి నరసయ్య

## నర్సయ్య బ్లాక్‌మెయిలింగ్‌కు లొంగిపోయిన ముఖ్యమంత్రి!

జీర్ణించుకోలేని వారికి ఆ అధికారిని చూస్తే వళ్లు కంపరమెత్తడంలో వింత ఏదీ లేదు. ఇటువంటివారు తొందరగా జిల్లా వదలి వెళ్తే బాగుండునని వెయ్యి దేవుళ్లకు మొక్కుకోవడంలోనూ విచిత్రం లేదు.

అయితే యావత్ పోలీసు యంత్రాంగం సిగ్గుతో తలదించుకో అస్మదీయుడు కావడమే ముఖ్యమంత్రి నిర్లిప్తతకు కారణమని చెప్పకనే అర్థమైపోతున్నది. నరసయ్యగారు పూర్వాశ్రమంలో స్వర్గీయ ఎన్‌టి. రామారావుకు సెక్యూరిటీ అధికారి. అప్పట్లో ఆయన ప్రాపకం కోసం వెంపర్లాడిన వాడు చంద్రబాబు. మామగారి మూడ్ కనుక్కొని లోపలకు వెళ్లడానికి సెక్యూరిటీ ఆఫీసర్ సహాయం చాలా అవసరం కదా? అప్పట్లో తను చేసిన తప్పులు, మామగారు పెట్టిన చీవాట్లు, తిన్నలంచాలు, కొట్టిన పల్టీలు సర్వం నరసయ్యకు కరతలామకం. చంద్రబాబులోని ఆ భయమే ఇప్పుడు నరసయ్యకు రక్షణ కవచం వలె వుపయోగపడుతుందన్న ఒక అంచనా. సేకరించిన సమాచారం చూపించి దేశంలోని వారందరికీ చెమటలు పట్టించే చంద్రబాబు, ఇప్పుడు తనే బ్లాక్‌మెయిల్‌కు భయపడే పరిస్థితి ఏర్పడిందంటే నరసయ్య గారి పవర్ ఏమిటో అర్థం చేసుకోవచ్చు.

నిజంగా చంద్రబాబులో ఆ భయం లేకుంటే ఇంత సంచలనాత్మక సంఘటనపై కనీసపాటి విచారణకైనా ఎందుకు పూనుకోవడం లేదు? హోం మంత్రిలోనూ ఉలుకుపలుకు లేదెందువల్ల?

ఏది ఏమైనా ఈ దగాకోరు తనంపై సమగ్రమైన, లోతైన దర్యాప్తు జరపనిదే పోలీసు శాఖకు పరువు నిలవదు. మోసగాళ్ల నుంచి ప్రజలను రక్షించవలసిన పోలీసులే మోసగాళ్లుగా మారితే ఇక ఖాకీ చొక్కాకు విలువ ఏమి వుంటుంది? పోలీసు వ్యవస్థపై ప్రజలకు విశ్వాసం లోపిస్తే ఎటువంటి విపరిణామాలు సంభవిస్తాయి? రేపు ఇటువంటి సంస్థ మరొకటి దొరికితే పోలీసులు దర్యాప్తుకు వెళ్లగలరా? వెళ్తే వారు ముఖాన్నే అడగరా - మీకొక నీతి, మాకొక నీతి - అని! జిల్లా మంత్రి, ఎమ్మెల్యేలు చొరవ చూపించి, హోం మంత్రిలో కదలిక తెచ్చి, ఈ దోపిడిపై సమగ్ర విచారణకు ఆదేశాలిప్పించడం; అది ముగిసే వరకు సంబంధిత పోలీసు అధికారులందరినీ సస్పెన్షన్‌లో వుంచడం అవసరం.

ఇదిట్లా వుంటే - ఇప్పుడు మరొక పోలీసు దుర్మార్గం వెలికి వచ్చింది. ఈ మధ్య తడ దగ్గర జరిగిన ఒక బస్సు దోపిడికి కారకులు, నిర్వాహకులు చిత్తూరు జిల్లా పోలీసులట. వారిలో ఒక దోపిడిదొంగ ఒక ఎమ్మెల్యేకు గన్‌మ్యాన్‌గా కూడా వున్నాడట. నెల్లూరు ఎస్పి గారే ఈ జుగుప్స కలిగించే నిజాన్ని వెలికి తీశారని వినికిడి. అయితే అక్కడా ఆయనకు ప్రతిఘటన ఎదురౌతున్నదని; చిత్తూరు తెలుగుదేశం నేతలు, అధికారులు సంబంధిత బందిపోట్లను

తరువాయి 7వ పేజీలో



# సణుగుడు

* ప్రసన్నకు నలుగుపెట్టి పంపాడు ముఖ్యమంత్రి.
* పెంచలురెడ్డికి ఎంత ప్రాభవం?

సంగం ఆనకట్టను బ్యారేజిగా మార్చాలని కోరుతూ కోవూరు ఎమ్మెల్యే నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి ప్రారంభించిన పాదయాత్ర అర్థంతరంగా ముగిసిపోయింది. అతికష్టం మీద ఒంగోలు వరకు నడిచాడాయన. కావలి చేరేటప్పటికే కాళ్లు వాచిపోయాయి. ఒక రోజంతా పడకసీను. ఒంగోలు వెళ్లేటప్పటికి కలెక్టర్ ఎదురు వచ్చాడు. కలెక్టర్ కారు ఆగడం చూసి, ఎమ్మెల్యేను స్వాగతించను వచ్చాడని అందరూ సంతోషించారు. కాని ఆయన రాకకు కారణం అది కాదు. ముఖ్యమంత్రి నుంచి సందేశం మోసుకొని వచ్చాడాయన. "తమరు నడిచింది చాలు. ఉన్నపళాన వెనక్కు తిరిగి వెళ్లకుంటే పరిస్థితులు తీవ్రంగా వుంటాయి" అని ముఖ్యమంత్రి మీతో చెప్పమన్నాడు అన్నారు కలెక్టర్. ఆయనకు లౌకికం తెలియనట్లుంది; ప్రక్కకు పిల్చి చెప్పివుంటే పరువుగా వుండేది; పది మందిలో చెప్పడంతో పాపం ప్రసన్న - ముఖం వ్రేలాడ పడిపోయింది. వారం రోజుల నడకను మించిన నీరసం ఆవహించింది. కలెక్టర్ మాట కాదని ముందుకు నడిస్తే సిఎంకు ఎదురు పడడం కష్టం; వెనక్కు మళ్లితే అవమానం. దేవుడు కరుణించి తుఫాన్ హెచ్చరిక వచ్చిందా సమయంలో! నా నియోజకవర్గంలో తుఫాన్ సహాయ చర్యల కోసం తిరిగి వెళ్తున్నాను అని మేకపోతు గాంభీర్యం ప్రకటించి, తోకముడుచుకొని నెల్లూరు వచ్చేశాడు.

అడుసు తొక్కనేల, కాలుకడగనేల? పాదయాత్రకు ముందే ప్రసన్నకు తెలుసు - ముఖ్యమంత్రికి ఇష్టం వుండదని; ఆయనకిష్టం లేని పనులు చేస్తే చీవాట్లు తప్పవని! అది తెలిసీ దీన్ని తలపెట్టాడంటే ప్రసన్న మనసులో ఆలోచన వుండి వుండాలి. అదేమిటో ఆయనకు మాత్రమే తెలిసిన సంగతి. సంగంలో బ్యారేజి నిర్మాణం తలలో మెదడు వున్న ఏ ఇంజనీరూ అంగీకరించడు; పూర్తిగా కట్టి పదేళ్లయిన సోమశిలకే భూసేకరణకు గతి లేదు; కొత్త ప్రాజెక్టుల కోసం ఖరీదైన భూములు సేకరించడం ఇప్పుడే కాదు - ఇక ఎప్పటికీ అసాధ్యం. నర్మద విషయంలో హైకోర్టు సుప్రీంకోర్టులు భూసేకరణకు నిర్ణయించిన ప్రమాణాలు పాటించడం రాష్ట్ర ప్రభుత్వాలకు తలకు మించిన పని. ఇవన్నీ ప్రసన్నకు తెలియవంటే నమ్మలేం; అయినా ఆ అర్థరహిత కోరికకు అంత ఆగం చేయబోయాడు. పిచ్చిపట్టిన వాడికి నలుగు పెట్టడం నాటు వైద్యం పద్ధతి; చంద్రబాబు చేతిలో అది జరిగిపోయిన తర్వాత, ఆ వెర్రి ఉపశమించింది.

పాదయాత్ర ఆగిపోయినా ప్రసన్న జేబు మాత్రం నిండింది. ఈ కార్యక్రమం పేరుతో ప్రతి పిడబ్ల్యుడి ఇంజనీరు దగ్గర, ప్రతి కాంట్రాక్టరు దగ్గరా దబాయించి మరీ చందాలు దండాడాయన. అది

## డోలేంద్ర

ఇప్పుడు లాభం. ఖర్చు కాలేదని దండిన డబ్బు తిరిగి ఇచ్చే సంస్కారం ఏ రాజకీయవాదికి వుంటుంది చెప్పండి?

***

పిట్టపోరు, పిట్టపోరు పిల్లికి లాభం అనేది సామెత; చెన్నారెడ్డి పెంచలురెడ్డి విషయంలో అది తిరగబడింది. పిల్లి పోరు పిట్టకు లాభమని త్రిప్పి వ్రాయాలి సామెతను. పెంచలరెడ్డి మాజీ ఎమ్మెల్యే; ఛరిష్మా కల్గిన విద్యార్థి నాయకుడు; కాని అవన్నీ పూర్వాశ్రమ లక్షణాలు. ఇప్పుడాయనకు వున్న ఏకైక క్వాలిఫికేషన్ అతివినయం. అందువల్లే అందరికీ ఆయనంటే ఎగతాళి; చులకన భావం! మాగుంట దేవిడిలో పెంచలురెడ్డి ఆత్మాభిమానం, వ్యక్తిత్వం ఎప్పుడో గోడకు తగిలించిన పటాలుగా మిగిలిపోయాయి. సర్వేపల్లితో ఆయనకు ఒక్క మనిషి లేడు; ఒక్క గ్రామంతో సంబంధాలు లేవు. కాని ఈ పిల్లిని చూసి పులివలె ఆగం చేస్తున్నాడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి. పెంచలురెడ్డిని పార్టీలో చేర్చుకొనే విషయంలో ముఖ్యమంత్రి దగ్గర ఒకటికి రెండు సార్లు పంచాయతీలు పెట్టించాడు; పార్టీ రాష్ట్ర కార్యాలయంలో చర్చ జరిపించాడు. పత్రికలలో ప్రతి రోజూ వార్తలు. ఇంకొక ప్రక్క ఆదాల ప్రభాకరరెడ్డి - పెంచలురెడ్డికి రక్షణ కవచం వలె నిలబడ్డాడు. ప్రతిచోటా సుప్రీంకోర్టు న్యాయవాది కంటే సీరియస్‌గా వాదిస్తున్నాడు. మంత్రి, మాజీ మంత్రుల లడాయికి సబ్జక్టు మారడంతో

తరువాయి 7వ పేజీలో

# అదే సరైన దారి !

కేంద్ర ప్రభుత్వ అనాలోచిత నిర్ణయాల వల్ల భారతీయ రైతాంగం ఎదుర్కొంటున్న ముప్పు తప్పించుకోవడానికి విదేశీ వస్తు బహిష్కారమే శరణ్యమని మాజీ ప్రధానమంత్రి వి.పి.సింగ్ ఇచ్చిన పిలుపు సహేతుకము. సమయోచితము అన్పిస్తున్నది. చరిత్ర పునరావృతం కావడం అంటే ఇదే! డెబ్బై ఏళ్ల క్రితం జాతిపిత మహాత్మాగాంధీ ఈ ఉద్యమం నడిపించారు. ఇన్నేళ్ల తర్వాత దాని అవసరం తిరిగి ఏర్పడుతున్నది. అప్పుడు, ఇప్పుడు కూడా సమస్య ఒకటే - భారతీయ ఆర్థిక వ్యవస్థ పతనమైపోయే ప్రమాదం. ఆనాడు అందుకు కారకులు పరాయిదేశ పాలకులు; ఈనాడు ఆ ముప్పు తెస్తున్న వారు పరాయి దేశ వ్యాపారులు. ముడిసరకులు దేశం నుంచి తరలించి, వాటితో తమ దేశంలోని పరిశ్రమలలో వస్తూత్పత్తి చేసి, తిరిగి ఇండియాలో అధిక ధరలకు అమ్మేవారు తెల్లదొరలు. తత్ఫలితంగా ప్రపంచమంతా పారిశ్రామిక విప్లవం వెల్లివిరిసిన సమయంలో మన దేశంలో మాత్రం గుండుసూది సైతం ఉత్పత్తి చేయలేని దౌర్భాగ్య పరిస్థితి నెలకొన్నది. దేశ జనాభా నూటికి నూరు శాతం వ్యవసాయంపై ఆధార పడవలసి రావడంతో ప్రజల జీవన ప్రమాణాలలో పెరుగుదల లేక పరమ దరిద్రగొట్టు దేశంగా పరిగ ణించబడింది.

70 ఏళ్ల తర్వాత తిరిగి ఇంచుమించు అదే పరిస్థితులు ప్రత్యక్షం కావడం విచారకరం. బిజెపి నేతలు ఎవరితోనూ సంప్రదించకుండా, ఎవరి సలహా తీసుకోకుండా, వెనుక ముందు ఆలోచించకుండా, ఆమెరికా అధ్యక్షుడ్ని సంతోషపెట్టడం కోసం డబ్ల్యుటిఒ ఒప్పందాన్ని రెండేళ్ల ముందుగానే ఆచరణలో పెట్టడంతో దేశ ఆర్థిక వ్యవస్థ సంక్షోభంలో చిక్కుకపోయింది. ఆహార ధాన్యాలతో సహా 741 రకాల వస్తువుల దిగుమతికి అనుమతి ఇచ్చింది కేంద్ర ప్రభుత్వం. దానితో ఇటు వ్యవసాయ రంగం, అటు చిన్న పరిశ్రమల రంగం దివాలా స్థితికి చేరుకున్నాయి. చైనా నుంచి ఎలక్ట్రానిక్ పరికరాలు, బొమ్మలు, గొడుగులు, ఫ్యాన్లు, లైట్లు వంటి వస్తువులు కుప్ప తెప్పలుగా దిగిపోయాయి. దేశంలోకి! వియత్నాం, ఇండోనేషియా దేశాలు చాలా చవక ధరలకు ఆహార ధాన్యాలు పంపుతున్నాయి; మలేసియా నుంచి పామాయిల్ స్టీమర్ల కొద్దీ దిగింది; శ్రీలంక నుంచి టెంకాయలు వచ్చాయి; ఇదే పరిస్థితి మరికొంత కాలం కొనసాగితే ప్రపంచ మార్కెట్‌కు ఇండియా సులువైన స్థావరంగా మారిపోవడం ఖాయం. చైనా నుంచి వచ్చిన వస్తువుల ధరలు చూస్తే కళ్లు తిరిగిపోతున్నాయి. రు400లకు సీలింగ్ ఫ్యాను, రు250లకు టెలిఫోన్ ఇన్‌స్ట్రుమెంట్ అమ్ముతున్నారు ఢిల్లీ బజారులో! రు50లకు నాణ్యమైన గొడుగు లభిస్తున్నది. భారత దేశంలోని ఏ చిన్న పరిశ్రమ కూడా ఈ ధరలకు వస్తువులు ఉత్పత్తి చేయలేవు. చైనాలో పరిశ్రమలకు ప్రభుత్వ సహకారం పూర్తి స్థాయిలో వుంటుంది; సబ్సిడీలు వుంటాయి. చైనా ప్రభుత్వానికి విదేశీ మారక ద్రవ్యం అవసరం. అందుకోసం వారు వస్తువుల ధరలు తగ్గించి అమ్ముతున్నారు. నష్టం ప్రభుత్వం భరిస్తుంది. మనవంటి దేశాలలో అది అసాధ్యం.

వ్యవసాయపరంగా కూడా అంతే! ఐరోపా దేశాలు తమ రైతులకు ఇచ్చే సబ్సిడీల విలువ 300 బిలియన్ డాలర్లని అంచనా. రూపాయల్లో దాని విలువ - 13 లక్షలా 50వేల కోట్ల రూపాయలు. మన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల మొత్తం బడ్జెట్ చూసినా ఇందులో పాతిక వంతు లేదు. ఆయా ప్రభుత్వాలు రీసర్చ్ పేరుతో, వ్యవసాయాధార పరిశ్రమలకు ఇన్సెంటివ్‌ల పేరుతో, వ్యవసాయోత్పత్తులకు మద్దతు ధరలు ఇవ్వడం ద్వారా ఈ సబ్సిడీలు ఇస్తున్నాయి. మన ప్రభుత్వాలు ఎగుమతిపైన మాత్రమే సబ్సిడీ ఇస్తున్నాయి. దాని విలువ కేవలం 4వేల కోట్ల రూపాయలు. ఈ కొద్ది సబ్సిడీ పట్లనే డబ్ల్యుటిఒ రభస సృష్టిస్తున్నది. విద్యుత్ రేట్లలో తగ్గింపును ప్రపంచ బ్యాంకు అభ్యంతర పెడుతున్నది. అగ్రరాజ్యాలు,

జమీన్‌రైతు

వాటి తాబేదారులైన సంస్థలు కలిసి భారతదేశం వంటి వర్ధమాన దేశాలను చక్రబంధంలో ఇరికించేస్తున్నాయి. వాటి లక్ష్యం - తమ ఉత్పత్తులు అమ్ముకోవడం! వర్ధమాన దేశాలలో పరిశ్రమలు, వ్యవసాయం పతనమైపోతే తప్ప తమ ఉత్పత్తులకు మార్కెట్ విస్తరించడం కష్టం అన్నది వారి కుట్ర. ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం అభివృద్ధికి లక్షల కోట్లు వెచ్చించి ఆ దేశాలతో మనం ఇప్పట్లో పోటీ పడలేము.

ఈ పరిణామాలన్నింటినీ కేంద్ర ప్రభుత్వం నిస్సహాయంగా తిలకిస్తున్నది తప్ప తగు జాగ్రత్తలు తీసుకోవడం లేదు. ప్రభుత్వానికి అది చేతకాని పని అని తేలిపోయింది. దాని ఫలితమే రైతులకెదురౌతున్న ఇతి బాధలు. పండించిన పంట అమ్ముకోలేని దౌర్భాగ్య స్థితిలో పడిపోయారు రైతులు. ఫ్యాక్టరీలు మూతపడుతుండడంతో లక్షలాది మంది కార్మికులు వీధుల పాలౌతున్నారు. వారి కుటుంబాలకు జీవనాధారం లేదు. ఈ పరిస్థితి నివారణకు ఒక చిన్న మార్గం విదేశీ వస్తు బహిష్కారం. భారతీయులందరూ స్వాతంత్ర్యోద్యమం నాటి స్ఫూర్తిని తిరిగి పొంది, సంఘటితమై, ఏకాభిప్రాయంతో విదేశాల నుంచి దిగుమతి అయ్యే ఏ వస్తువునూ కొనకుండా తిరస్కరిస్తే - దేశంలో వ్యవసాయం బాగుపడుతుంది; చిన్న పరిశ్రమలూ తెరిపిన పడతాయి. అంతర్జాతీయ పోటీని ఎదుర్కోవడానికి మన ఆర్థిక వ్యవస్థ సన్నద్ధమయ్యే వరకు ఇటువంటి ప్రజా ఉద్యమాల ద్వారా మాత్రమే ప్రజల కష్టాలు తీరుతాయి; ప్రభుత్వాల వల్ల ఏమీ జరగవు. *

---

## జమీన్‌రైతు 50 ఏళ్ల క్రితం నాటి

జమీన్‌రైతు

1-12-1950

పేజీలు:12 వెల: 0-3-0

### కమ్యూనిస్టు చైనా కావరం

టిబెట్‌పై కమ్యూనిస్టు చైనా దుందుడుకుతో దూకినప్పుడు, శాంతిని వాంఛించే భారత ప్రభుత్వం అందుకు తన ఆశ్చర్యాన్ని విచారాన్ని తెలియజేస్తూ పెకింగ్‌కు ఒక లేఖ పంపింది.

ఆ లేఖకు పెకింగ్ ఇచ్చిన సమాధాన సారాంశం ఇది. "టిబెట్‌పై చైనాకు సామ్రాజ్యస్వత్వమున్నది. చైనాకు టిబెట్ ఒక వలస దేశం. దానిని ఆక్రమించుకొనడానికి చైనా ఉద్యమించింది. ఇది చైనా అంతరంగిక వ్యవహారం. ఇందు భారతదేశం ప్రమేయం పెట్టుకోరాదు "- అని.

ఈ జవాబును చూచి అత్యాశ్చర్యాన్ని పొందుతూ భారతదేశం తిరిగి మరొక జాబు వ్రాసింది. "పరదేశాల స్వాతంత్ర్యాన్ని రక్షించడం, గౌరవించడం 'కమ్యూనిజం' అవుతుంది కాని, భక్షించడం కాదు గదా!" అంటూ తన విభ్రాంతి భారత ప్రభుత్వం సిద్ధాంత రీత్యా తేట తెల్లం చేసిందట.

అందుపై ఆ రెండవ జాబుకు జవాబునిస్తూ కమ్యూనిస్టు చైనా ఇలా వ్రాసిందట. టిబెట్‌లో మీకు ఆశ్రయాలున్నవి. వాటిద్వారా టిబెట్‌ను ఏనాటికైనా, ఎలాగైనా ఆక్రమించుకొనవలెనని మీరు ఉద్దేశిస్తున్నట్లు కనపడుతున్నది. లేకపోతే, చైనా అంతరంగిక వ్యవహారమైన టిబెట్ సమస్యలో ప్రమేయం పెట్టుకోవలసిన పని మీకు లేదు" అని - అయితే, ఈ రెండు ప్రత్యుత్తరాలహంశాలు ప్రకటితం కాకపోయినా, అభిజ్ఞవర్గాల వాఖ్యానాలు వీటిని వెల్లడి చేస్తున్నవి.

ఇదే యదార్థమైతే - ఎంత చిత్రంగా వుంది.

### వీరారెడ్డిసత్రానికి వెయ్యివిరాళం

మద్రాసు డాక్టర్లలోని ఒక గుప్త దాత ఆయాచితముగ వాకాటి వీర రాఘవరెడ్డి ధర్మసత్రమునకు రు1000 వెయ్యి రూపాయలు విరాళమునిచ్చె

50 ఏళ్ల క్రితం నాటి

దమని 28.11.50తేదిన చెప్పిరి.

***

పై సత్రమునకు భూరివిరాళ మొసంగెదమన్న శ్రీ బెజవాడ శివకోటారెడ్డి గారు తన విరాళమును త్వరగా పంపుచున్నానని కార్యదర్శి గారికి వుత్సాహముతో తెలియపరచిరి. ఇట్లే మిగత దాతలు కూడా వెంటవెంటనే తమ విరాళములనంపి కార్యసిద్ధిని గావింతురని ఆశించుచున్నాము.

నెల్లూరు ముచ్చట్లు

జిల్లా డాక్టరు

త్యాగరాజ పిళ్లెగారు జబ్బుగా వుందని శలవుపెట్టారు. మద్రాసులో

తరువ 10వ పేజీలో

---

## జనవాణి

# పన్నులు పెంచి పళ్లూడగొడుతున్నారు!

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అన్ని రాష్ట్రాలలో ఒకే విధమైన అమ్మకపు పన్నులు వుండాలని ఈ సంవత్సరం జనవరి 1తేది నుంచి అమలు చేశారు. అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు దీన్ని అమలు చేయకపోయినా మన ప్రభుత్వం అమలు చేసి పొరుగు రాష్ట్రాలకన్నా అధిక పన్నులు విధించారు. ప్రక్క రాష్ట్రాలలో వంట నూనెలు ఇంకా కొన్ని పప్పుదినుసులపై అమ్మకపు పన్ను లేదు. మన రాష్ట్రంలో అన్నింటిపై పన్నులు విధించి రాష్ట్ర ప్రభుత్వం ఖజానా నింపుకొంటుంది. కేంద్ర ప్రభుత్వం సూచనలు పాటించకుండా ఇతర రాష్ట్రాలను పరిగణనలోనికి తీసుకోకుండా ఒక్క రాష్ట్ర ప్రభుత్వమే పన్నులు పెంచడం దారుణం.

నెల్లూరు కె.వి.చలమయ్య

### టీచర్ల ఉద్యోగాలు అమ్ముకొన్నారు

విద్యాశాఖలో జరుగుతున్న పలు కుంభకోణాలను వెలికితీసిన జమీన్ రైతుకు అభినందనలు. డిఎస్‌సి 2000 పరీక్షా ఫలితాలు బాగా చదువుకొని పరీక్ష వ్రాసిన వారిని నిరాశను కలిగించాయి. డి.ఇ.ఓ, డిప్యూటీ డి.ఇ.ఓ కుమ్మక్కై ఫలితాల్లో గోల్మాల్ చేశారని చెప్పొచ్చు. దీనివల్లే ఏ కులానికి, వర్గానికి ఎన్ని ఉద్యోగాలు కేటాయించారన్న విషయం బయటకు తెలపలేదు. డిఎస్‌సిలో ప్రతి వ్యవహారం పారదర్శకమైనప్పుడు, ఎందుకు దాస్తున్నారో తెలియడం లేదు. జాయింట్ కలెక్టర్ పర్యవేక్షణలో ఈ వ్యవహారమంతా గందరగోళం కావడం బాధాకరం. ఈ వ్యవహారంలో తన ప్రమేయమేమీ లేదని జిల్లా కలెక్టర్ ప్రవీణ్ కుమార్, విద్యాశాఖ మంత్రి కడియం శ్రీహరి ముందు చెప్పడం సమంజసం కాదు.

నెల్లూరు వి.శ్రీనివాసులురెడ్డి

### ఫస్ట్ ఎయిడ్ బాక్సులు ఎందుకున్నట్లు?

ఆర్టీసి యాజమాన్యం ప్రజాశ్రేయస్సును దృష్టిలో వుంచుకొని ఆర్టీసి బస్సుల్లో ఫస్ట్ ఎయిడ్ బాక్సు ఏర్పాటు చేసింది. కానీ ఈ బాక్సులు బస్సుల్లో అలంకార ప్రాయమయ్యాయి. అత్యవసర పరిస్థితులలో వాడేందుకు అవసరమైన టించర్, పౌడర్, ఆయింట్‌మెంట్, దూది, డెట్టాల్, కట్టుకట్టేందుకు గుడ్డలు అసలు కనపడడమే లేదు. బస్సుల్లో చిన్న చిన్న ప్రమాదాలు ఎక్కువైన ఈ రోజుల్లో ఫస్ట్ ఎయిడ్ బాక్సుల అవసరం ఎంతైనా వుంది. ఆర్టీసి యాజమాన్యం ఈ విషయమై స్పందిస్తే బాగుంటుంది.

గరిమనపెంట నాగేశ్వరరావు

### బేష్... ఎస్పీ

కొత్త ఎస్పీ శ్రీనివాసరెడ్డి తీసుకొంటున్న పలు చర్యలు ప్రజలకు ఎంతగానో ఉపయోగపడేవి. జిల్లాలో ఎందరో ఎస్పీలుగా పనిచేసి వెళ్లారు. కాని ట్రాఫిక్ సమస్యను నెలరోజుల్లో ఒక గాడికి తెచ్చిన ఎస్పీ ఎవరూ లేరు. శ్రీనివాసరెడ్డి ఆ పని చేసి చూపెట్టారు. ప్రతి బ్రాందీ షాపు వెనుక అనధికారికంగావెలసిన అక్రమ బార్లపై ఉక్కుపాదం మోపారు. టౌన్‌బస్సుల స్పీడ్‌కు కూడా బ్రేకులు వేయను ప్రయత్నాలు మొదలెట్టారు. గ్రీన్‌గ్లోరి వ్యవహారంతో సంబంధమున్న పోలీసు అధికారుల గుట్టు రట్టు చేశారు. నెల్లూరు టౌన్‌లో రౌడీయిజం చాపక్రింద నీరులా విస్తరిస్తుంది. దీనిపై దృష్టి సారించిన ఎస్పీ అభినందనీయుడు. ఎస్పీ వ్యవహారసరళికి ఎన్ని అడ్డంకులు ఎదురైనా ప్రజల సహకారంతో ముందడుగు వేయాలని మనసారా కోరుకొంటున్నారు.

గంగవరం జి.రామకృష్ణప్రసాద్

### ద్వారక ఎందుకు మునిగిపోయింది?

నవంబర్ 3తేది జమీన్‌రైతు సంచికలో వాస్తు సరిలేక ద్వారక సముద్రంలో మునిగిపోయిందన్నారు. శ్రీకృష్ణుని కాలం అనగా మన పంచాంగాల ప్రకారం సుమారు 5500 సంవత్సరాలు శ్రీకృష్ణుని పుట్టుకకు ముందు నుంచి వున్న

తరువ 10వ పేజీలో

# అమ్మకానికి అమ్మాయిలు!

అర్థంపర్థం తెలియని అమాయక బాలికలను వ్యభిచారపు రొంపిలోకిదించే మహిళల ముఠాలు నెల్లూరులో ఇటీవల కాలంలో ఎక్కువై పోయాయి. హైస్కూల్ స్థాయి విద్యార్థినులనే ఈ ముఠా ఎక్కువ గాలం వేసి తమ వలలో చేజిక్కించుకొని వారి జీవితాలను పసివయస్సుల్లోనే పతకలపై పాతరవేస్తున్నాయి. అత్యంత దుర్మార్గమైన ఈ ముఠాల ఆచూకీ పట్టి, పోలీసులు వారి భరతం పట్టాల్సిన

## నెల్లూరులో మహిళల ముఠా గుట్టు రట్టు

అవసరం వుంది. నెల్లూరులో ఇటీవల 16ఏళ్ల బాలిక దీనగాథ వింటుంటే కడుపు తరుక్కుపోతుంది. నెల్లూరులో వ్యభిచార దురాచారానికి ఇదొక నిదర్శనం మాత్రమే. పోలీసులు కాస్త శ్రద్ధ చూపిస్తే మరిన్ని ముఠాల బండారం బట్టబయలవుతుంది.

తక్కువ సమయంలోనే ఎక్కువ డబ్బు సంపాదించి లక్షాధికారులు కావాలనే ఆశతో కొందరు మహిళలు నిరుపేద యువతులు, విద్యార్థినులకు రకరకాల ఆశలు కల్పించి వ్యభిచారపు ఊబిలోకి తెలివిగా దింపుతున్నారు. స్టోన్‌హౌస్‌పేటకు చెందిన ఒక లారీ యజమాని 16ఏళ్ల మైనర్ బాలిక వివిఎస్ బాలికల పాఠశాలలో 9వ తరగతి చదువుతుంది. ఆ బాలిక తన స్నేహితురాలి ఇంటికి తరచూ వెళ్తుండగా, స్నేహితురాలి తల్లి వరమ్మ ఆ బాలికను ఐస్‌క్రీం, బ్యూటీ పార్లర్ షాపులకు తిప్పి దారి మళ్లించింది ఒకరోజు తన ఇంట్లోనే ఒక గదిలో పెట్టి, ఓ యువకుడితో అత్యాచారం చేయించింది. తర్వాత ఈ విషయం తల్లితండ్రులకు చెబుతానని భయపెట్టి లొంగదీసుకుంది. జెండావీధిలో బ్యూటీ పార్లర్ నిర్వహిస్తున్న రుబెనా మైనర్ బాలికను సినిమాల్లో చేర్పిస్తానని నమ్మబలికి ఈ బాలిక చేత అపార్ట్‌మెంటుల్లో, హోటళ్లలో హైక్లాస్ వ్యభిచారం చేయించేది. దీని వల్ల వచ్చే వేల రూపాయలు వరమ్మ, రుబెనాలతోపాటు కామాక్షి, నాగమ్మ, లలిత, లావణ్య, సరోజనమ్మ, సంయుక్త, జాన్సీ అనే మహిళలు పంచుకొనేవారు. ఇటీవల మైనర్ బాలికను వరమ్మ హైదరాబాద్‌లోని టివి యాక్టర్ సంయుక్త వద్దకు తీసుకెళ్లి అక్కడా వ్యభిచారం ప్రారంభించింది. పలువురు యువతులను కూడా నెల్లూరులోని 8 మంది మహిళల

తరువాయి 11వ పేజీలో

# ఖైదీల 'తిండి' పందులకూ వెగటే

జిల్లా జైలులోని ఖైదీలకు పెట్టే ఆహారం పందులు కూడా ముట్టవని చెబుతున్నారు. ఖైదీలకు ప్రతిదినం పోషకాహారపు విలువలతో కూడిన ఆహారం, వారానికోసారి మాంసం పెట్టాలని జైలు మాన్యువల్‌లో వున్నా, సిబ్బంది దీన్ని ఖాతరు చేయడం లేదు. పనికి మాలిన ఆహారం తింటున్నందు వల్ల జైలులోని పలువురు ఖైదీలు అల్సర్, కడుపులో నొప్పి, గ్యాస్ట్రిక్ సమస్యలతో పాటు పలు రకాల చర్మ రోగాల బారిన పడివున్నారు. నెల్లూరులోని జైలు మొదటి శ్రేణి జిల్లా జైలుగా గుర్తింపబడింది. దీనిలో 900 మందికిపైగా వివిధ రకాల ఖైదీలున్నారు. వీరికి ఉదయం 6గంటలకిచ్చే టీకి వేడి నీటికి పెద్ద తేడా కన్పించడం లేదు. ఉదయం

## జిల్లా జైలులో అవినీతి

సమయంలో అల్పాహారంలో గబ్బు కొడుతున్న చద్దెన్నం, మూడు రోజులు పొంగలి పెడుతున్నారు. ఈ పొంగలి నోట్లో పెట్టుకోగానే వాంతి రావడం ఖాయమంటున్నారు. 10.30 ప్రాంతంలో పెట్టే మధ్యాహ్నపు భోజనంలో సాంబారు రంగులో వేడినీళ్లు పోస్తున్నారు. నాసిరకం బుడ్డల బియ్యంతో అన్నం వండుతుండడం వల్ల అరగక నానా యాతనలు పడాల్సి వస్తుంది. సాయంత్రం 4.30కు పెట్టే రాత్రి భోజనంతో ఉడికీ, ఉడకని ఒకే కూరపెట్టి సరిపెట్టుకొంటున్నారు. పచ్చడి ముఖం చూసి చాలా రోజులయ్యిందని ఖైదీలు వాపోతున్నారు. మార్కెట్‌లో తక్కువ రేటు పలికే ముల్లంగి, కందగడ్డ కూరలే జైలులో రోజు మార్చి రోజు చేస్తున్నారు. మాస్టర్ ఖైదీలు పెరుగును ఇతర ఖైదీలకు పంచడంలేదనే ఆరోపణలు కొకొల్లలు. వారానికోసారి పెట్టే కోడిమాంసం కూడా జైలు సిబ్బంది పెట్టడం లేదు. మార్కెట్లో పారేసిన కోళ్ల కాళ్లు, తలలు పెట్టి సరిపెడుతున్నారు. మాంసపు బడ్జెట్ మొత్తం జైలు సిబ్బంది జేబుల్లోకి వెళ్తుంది. జైలులో ఖైదీలందరికీ కలిపి ఒకే మంగలి వుండడం కూడా సమస్యగా పరిణమించింది. జైలులో విపరీతంగా వున్న దోమల దెబ్బకు ఖైదీలకు ప్రతిరాత్రి శివరాత్రే. పోయిన వారం ఒక ఖైదీని కొత్తగా వచ్చిన సిబ్బందిలో ఒకరు కాళ్లపై రెండు గంటల పాటుబియ్యపు మూటలు పెట్టి వీపు విమానం మోత మోగించే శిక్ష విధించాడు. దీన్ని నిరసిస్తూ ఖైదీలందరూ నిరాహారదీక్ష చేశారు. జిల్లా ఉన్నతాధికార్లు అక్టోబరు 2తేది మాత్రమే జైలును సందర్శించి సరిపెట్టుకోవడం సమంజసం కాదు. అప్పుడప్పుడు ఆకస్మిక సందర్శనలు చేస్తే జైల్లో పరిస్థితులు కళ్లకు కట్టినట్లు కనపడతాయి.

## ఇంటర్వ్యూలయ్యాయి - నియామకాలేవీ!

స్త్రీ, శిశు సంక్షేమ శాఖలో ఖాళీగా వున్న అటెండర్లు, కుక్ ఉద్యోగాలకు ఇంటర్వ్యూలయ్యి నెలగడుస్తున్నా ఇంత వరకు నియామక వుత్తర్వులివ్వలేదు. ఈ పోస్టుల నియామకానికి అక్టోబర్ 24తేది ఇంటర్వ్యూలు నిర్వహించారు. దీనికి 70 మంది నిరుద్యోగులు హాజరయ్యారు. ఈ ఉద్యోగాలను పూర్తిగా మెరిట్ మీద ఆధారపడి ఇవ్వాలి. కాని శిశు సంక్షేమ శాఖాధికారులు

తరువాయి 11వ పేజీలో




అక్షర సంక్రాంతి సమీక్షా సమావేశంలో మాట్లాడుతున్న పాఠశాలల విద్యామంత్రి కడియం శ్రీహరి, ప్రక్కన సూళ్లూరుపేట ఎమ్మెల్యే పరసారత్నం, కలెక్టర్ ప్రవీణ్‌కుమార్, తిరుపతి ఎమ్పీ వెంకటస్వామి, జాయింట్ కలెక్టర్ రావత్.

# సందర్శకులు దండి-సిబ్బంది ఏరండీ!

చిల్డ్రన్స్ పార్కు నిర్వహణా బాధ్యతలు చూసే సిబ్బందిని నియమించకుండానే పార్కును ప్రారంభించడం వల్ల రెండు, మూడు నెలల్లోనే పార్కు మూతబడే పరిస్థితులు నెలకొని వున్నాయి. చింతారెడ్డిపాళెం డొంకలో అత్యద్భుతంగా కట్టిన పార్కు అనతికాలంలోనే ఆబాల గోపాలాన్ని అలరిస్తోంది. ప్రారంభించిన పదిరోజుల్లోనే 30వేల మంది ప్రజలు ఈ పార్కును సందర్శించారు. కేవలం 19, 26 తేదీల్లో 15వేల మంది పార్కును చూడను రావడం వల్ల రామలింగాపురం సెంటర్‌లోని ఇరిగేషన్ ఆఫీసు వద్ద నుంచి పార్కు వరకు సాయంత్రం 6గంటలు నుంచి 8 గంటల వరకు ట్రాఫిక్ నిలబడిపోయింది. 26తేది సందర్శకుల సంఖ్య 7వేలకు మించిపోవడం వల్ల టిక్కెట్లు ఇవ్వడం ఆపివేయడం వల్ల మరో 4వేల మంది ప్రజలు పార్కును చూడలేక వెనుతిరిగి వెళ్లిపోయారు.

సందర్శకుల సంఖ్య ఎక్కువగా వుండడం పార్కు నిర్వహణకు, దానిలోని బాగోగులు చూసేందుకు సిబ్బంది లేకపోవడం వల్ల పార్కు మనుగడ ప్రశ్నార్థకమయ్యింది. దీనివల్లే పార్కులో గందరగోళ పరిస్థితులు నెలకొంటున్నాయి. పార్కును చూసే వ్యక్తులు

## నిర్వహణ ఇలాగే వుంటే పార్క్ 'మూత' ఖాయం

నడిచే వెళ్లేందుకు ఫుట్‌పాత్‌ను కట్టివున్నప్పటికి దానిపై నడిచి వెళ్లే వారే లేరు. అందంగా పెరిగిన పూలమొక్కలు, లాన్‌లను తొక్కుకొంటూ జనం వెళ్లి పోతున్నారు. ఫౌంటెన్ ప్రక్కన మరోచోట చిన్న మొక్కలతో ఏర్పాటు చేసిన అందమైన ఆకృతులకు లైటింగ్ లేకపోవడం వల్ల ప్రజలు వాటిని తొక్కి పడేస్తున్నారు. చిన్న పిల్లల కోసం ఏర్పాటు చేసిన ఊయలు, జారుడు బల్లలు, ఇతర ఆటవస్తువులను పెద్దలు సైతం ఎక్కి కుమ్ముదమ్ము చేస్తున్నారు. ఆకతాయి పిల్లలైతే ప్రవేశానికి టిక్కెట్లు సైతం కొనకుండా ఫెన్సింగ్ ఎక్కి పార్కులోకి వచ్చి గందరగోళం సృష్టిస్తున్నారు. ఇంత పెద్ద పార్కును పర్యవేక్షించను కనీస సిబ్బందిని పార్కును స్వాధీనం చేసుకొన్న పర్యాటక శాఖ ఇంత వరకు నియమించుకోలేదు. దీని వల్లే అన్ని సమస్యలు ఏర్పడుతున్నాయి. పర్యాటక శాఖ ఇన్‌ఛార్జి అధికారిగా జిల్లా పౌరసంబంధ శాఖాధికారి ఏ నిర్ణయం స్వతంత్రంగా తీసుకోలేక పోతున్నారు. సోషల్ ఫారెస్టీకి చెందిన ఐదుగురు ఎన్ఎంఆర్‌లు, పార్కు నిర్వహణ బాధ్యతలు మొత్తం చూడడం కనాకష్టమై పోయింది. ఇప్పటికీ పార్కు దాత జె.ఎన్.రెడ్డి నియమించిన సిబ్బందే పార్కు బాగోగులు చూస్తున్నారు. అదనపు సిబ్బందిని

తరువాయి 11వ పేజీలో

# డిప్యూటీ డి.ఇ.ఓ.పై విచారణకు ఆదేశం

జిల్లాలో టీచర్స్ రిక్రూట్‌మెంట్ (డిఎస్‌సి) పరీక్షల్లో జరిగిన అవకతవకలపై విచారణ జరిపి తనకు నివేదిక పంపమని పాఠశాలల విద్యాశాఖామంత్రి కడియం శ్రీహరి, జిల్లా కలెక్టర్ ప్రవీణ్ కుమార్‌ను కోరారు. 26తేది రోడ్లు భవనాల అతిథి గృహంలో విలేఖరుల సమావేశంలో డిఎస్‌సి పరీక్షల్లో జరిగిన అవకతవకలను విని మంత్రి ఆశ్చర్యాన్ని వ్యక్తం చేశారు. డిఎస్‌సి అభ్యర్థులకు బోగస్ వెవిటి సర్టిఫికేట్లు ఇచ్చిన డాక్టర్లు, విద్యా సంస్థలు, సర్టిఫికేట్లు తీసుకొన్న వారిపై తగిన చర్యలు తీసుకొంటామన్నారు. ఈ వ్యవహారమంతా జెసి, డిఇఓ, డిప్యూటీ డిఇఓలు జరిపారని చెప్పి జిల్లా కలెక్టర్ ప్రవీణ్‌కుమార్ తప్పించుకున్నారు. డిప్యూటీ డిఇఓ మువ్వా రామలింగం డిఎస్‌సిలో, కౌన్సెలింగ్‌లో పాల్పడిన అవకతవకలపై విచారణ చేయిస్తానని మంత్రి ప్రకటించారు. డిఇఓ కార్యాలయం సెంట్‌పీటర్స్ స్కూల్‌లో నడుపుతున్నందుకు తన ప్రియశిష్యుడు డిఇఓ జయచంద్రకుమార్‌ను సైతం మంత్రి మందలించారు. ఉర్దూ మీడియంలో డిఎస్‌సి రాసిన అభ్యర్థులకు పోస్టింగ్‌లు ఇచ్చేందుకు తగిన చర్యలు తీసుకొంటున్నట్లు మంత్రి చెప్పారు.

## అక్షర సంక్రాంతిని విజయవంతం చేయాలి

అక్షర ఉద్యమాన్ని సామాజిక ఉద్యమలా తలచి చిత్త శుద్ధితో పనిచేసి అక్షర సంక్రాంతిని విజయవంతం

**నెల్లూరు సంగతులు**

చేయాలని రాష్ట్ర పాఠశాలల విద్యాశాఖ మంత్రి కడియం శ్రీహరి ఉద్బోధించారు. 26తేది జడ్పీ మీటింగ్ హాలులో జరిగిన అక్షర సంక్రాంతి సమీక్షా సమావేశంలో మంత్రి ముఖ్యఅతిథిగా పాల్గొని మాట్లాడారు. రాష్ట్రంలో అక్షర సంక్రాంతి కార్యక్రమంలో 60లక్షల మంది నిరక్షరాస్యులను అక్షరాస్యులుగా తీర్చిదిద్దాలని నిర్ణయించాం. ఈ కార్యక్రమ నిర్వహణకు జిల్లాకు 50లక్షల రూపాయల వంతున మొత్తం 11కోట్ల 50లక్షలు విడుదల చేసినట్లు మంత్రి చెప్పారు. రాష్ట్ర ప్రభుత్వం అజెండాలో అక్షర సంక్రాంతి కార్యక్రమం ప్రస్తుతం ప్రథమస్థానంలో వుంది. జిల్లాలోకూడా అక్షర సంక్రాంతి కార్యక్రమంలో పంచాయతీ సర్పంచ్‌లు, విఓలు, విడిఓలు, అంగన్‌వాడీ కార్యకర్తలు ఇతర ప్రభుత్వ శాఖల అధికారులు తప్పనిసరిగా పాల్గొని ఎక్కువ మందిని అక్షరాస్యులు చేయాలని మంత్రి కోరారు. తిరుపతి ఎమ్పీ ఎన్. వెంకటస్వామి, ఎమ్మెల్యేలు బల్లి దుర్గాప్రసాద్‌రావు, పరసా రత్నం, కలెక్టర్ ప్రవీణ్‌కుమార్, జాయింట్ కలెక్టర్ ఎస్.ఎస్. రావత్ ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## మహిళా సంక్షేమానికి కృషి

మహిళలపై జరుగుతున్న అత్యాచారాలు, తదితర కేసులను పరిష్కరించేందుకు మండల స్థాయిలోని డ్వాక్రా గ్రూపులలో సమర్థత కలిగిన మహిళలకు గుర్తింపు కార్డులు జారీ

తరువాయి 11వ పేజీలో

# వరదపనుల్లో అవినీతి దురద!

పూర్తయిన పనులకే తిరిగి కొత్తగా టెండర్లు ఆహ్వానిస్తూ సరికొత్త అవినీతి పర్వాన్ని ఆవిష్కరించారు బుచ్చిరెడ్డిపాళెంలోని పంచాయతీ రాజ్‌శాఖ అధికారులు. బుచ్చిరెడ్డిపాళెం పంచాయతీ సబ్ డివిజన్‌కు వరద నష్టాల మరమ్మత్తు పనులకు 12లక్షల 8వేల రూపాయలు మంజూరయ్యాయి. వీటిలో దగదర్తికి 10.5లక్షలు, బుచ్చికి 2లక్షలు, సంగంకు

## పూర్తయిన పనులకే 12 లక్షల టెండర్లు

30వేలు కేటాయించారు. దగదర్తి మండలానికి సంబంధించి బుచ్చి -దగదర్తి రోడ్డు నుంచి ధర్మవరం బ్రాంచి రోడ్డుకు వరద నష్టాల పని నిమిత్తం 2లక్షల రూపాయలకు పంచాయతీ అధికార్లు నవంబర్ 18తేది టెండర్లు ఆహ్వానించారు. ఈ రోడ్డు పరిధిలోని రైతులు తమ సొంత ఖర్చులతో ఈ మధ్యనే రహదారిని ఏర్పాటు చేసుకొన్నారు. రైతులు సొంతంగా ఏర్పాటు చేసుకొన్న రోడ్డుకే అధికారులు తిరిగి టెండర్లు పిలవడం వల్ల రెండు లక్షల ప్రభుత్వ ధనం కాంట్రాక్టర్ జేబులోకి వెళ్లే అవకాశం చిక్కింది. పూర్తయిపోయిన ఈ పనిని చూపించి డబ్బులు స్వాహా చేయడానికి తెలుగుదేశం పార్టీకి చెందిన నాయకుడొకరు సిద్ధంగా వున్నట్లు తెలిసింది. దీనికితోడు దగదర్తి, పుత్తేరు రోడ్డుకు వరద నష్టమేమీ లేనప్పటికీ అధికారులు 2లక్షలతో మరమ్మత్తు పనులకు టెండర్లు ఆహ్వానించారు. బుచ్చి, సంగం, దగదర్తి మండలాలకు సంబంధించి వరద నష్టమేమీ జరగకున్నా ఈ పద్దులో మంజూరైన 12.8లక్షలు తమ స్వంతం చేసుకోను తెలుగు తమ్ముళ్లు తహతహలాడుతున్నారు. గతంలో 10వేల రూపాయల పనికి కూడా టెండర్లు ఆహ్వానించని పంచాయతీరాజ్ శాఖాధికారులు ప్రస్తుతం లక్ష రూపాయల పని వరకు

తొరవ 8వ పేజీలో

# మహిళల కన్నెర్ర - మందు షాపుల మూత!

సిపిఎం పార్టీ కంచుకోటైన దామరమడుగు గ్రామంలో మహిళలు విజృంభించి ఆరు బ్రాండీ షాపులను మూయించారు. గ్రామంలో 6వేల మంది జనాభా వుండగా, బ్రాండీ షాపుల యజమానులు ఆరుబెల్టు బ్రాండీ షాపులు ప్రారంభించారు. బెల్ట్ షాపుల మూలంగా గ్రామంలో

## జిల్లావార్తలు

మందు బాబుల జల్సా ఎక్కువైపోయింది. కూలీడబ్బులు ఇంటికి తేవడమే మానేశారు. ఇంటిని పోషించాల్సిన భారం మహిళలపైనే పడింది. దీంతో గ్రామ మహిళలంతా సమావేశమై బెల్ట్ బ్రాండీ షాపులను గ్రామంలో లేకుండా చేయాలని తీర్మానించారు. ముందు ఈ విషయాన్ని అధికారుల దృష్టికి తీసుకెళ్లినా ఫలితం లేకుండా పోవడంతో మహిళలు కొంగు బిగించారు. మర్యాదగా చెబితే వినకపోయేసరికి దౌర్జన్యంగా బెల్ట్ బ్రాండీ షాపుల్లోని సరకునంతా వీధుల్లో పారబోశారు. గ్రామ మహిళలందరిదీ ఈ విషయంలో ఒకేమాట కావడంతో బ్రాండీ షాపుల వ్యాపారస్తులు తోకముడవక తప్పలేదు. ప్రతి గ్రామంలో ఇటువంటి చైతన్యమే వస్తే బెల్ట్ బ్రాండీ షాపులు ఎందుకుంటాయి?

## నకిలీ గుళికల ముఠా అరెస్ట్

బుచ్చిరెడ్డిపాళెం కేంద్రంగా ఒక ప్రముఖ కంపెనీని పోలిన విధంగా నకిలీ క్రిమి సంహారక గుళికల వ్యాపారం సాగిస్తుండిన ముగ్గురు సభ్యులు గల అంతర్ రాష్ట్ర ముఠాను బుచ్చి పోలీసులు అరెస్టు చేశారు. పోలీసుల కథనం ప్రకారం నంద్యాలకు చెందిన సుభాన్ బాష

తొరవ 8వ పేజీలో

కావలి సైన్స్‌ఫేర్‌లో విద్యార్థులు ఏర్పాటు చేసిన నమూనాను పరిశీలిస్తున్న జిల్లా కలెక్టర్ ప్రవీణ్‌కుమార్, ఎమ్మెల్యే వేణుగోపాలరెడ్డి, కావలి మునిసిపల్ ఛేర్మన్ యానాదిశెట్టి, డి.ఇ.ఓ. జయచంద్రకుమార్.

# దొంగపోలీసులు కాదు - పోలీసుదొంగలు

దొంగలను పట్టుకోవాల్సిన పోలీసులే దొంగతనాలకు పాల్పడుతున్నారన్న వార్త ఒకింత ఆశ్చర్యాన్ని కల్గించవచ్చు. కాని ఇది వాస్తవమని నెల్లూరు పోలీసుల దర్యాప్తులో తేలింది. తడ వద్ద నవంబరు 13తేది రాత్రి మద్రాసు వెళ్తున్న ఆర్టీసి బస్సును ఆపి అందులో ప్రయాణిస్తున్న నెల్లూరుకు చెందిన బంగారు వ్యాపారి వద్ద మూడున్నర కేజీల బంగారాన్ని పట్టుకెళ్లింది చిత్తూరు జిల్లాలో పనిచేస్తున్న ఆర్మ్‌డ్ రిజర్వు పోలీసులే. ఈ దొంగ కానిస్టేబుళ్లలో ఒకడు చిత్తూరు టౌన్ ఎమ్మెల్యే సి.కె.బాబు గన్‌మెన్‌గా కూడా పనిచేస్తున్నాడట. బంగారు నగలు పోగొట్టుకున్న వ్యాపారిని చిత్తూరుకు తీసుకెళ్లి ఇద్దరు ఎఆర్ కానిస్టేబుళ్లను చూపించగా వారేనని గుర్తుపట్టాడు. అయితే చిత్తూరులోని అధికార తెలుగుదేశం పార్టీ, పోలీసు అసోసియేషన్ నాయకులు ఈ కానిస్టేబుళ్ల రక్షణకు సకల ప్రయత్నాలు ప్రారంభించినట్లు తెలిసింది. గూడూరు డిఎస్పీ జనార్ధన్, నాయుడుపేట ఎస్‌ఐ దిలీప్‌కుమార్ వీరిని అరెస్ట్‌చేసి తీసుకవచ్చే ప్రయత్నం చేయగా చిత్తూరు జిల్లా పోలీసు ఉన్నతాధికారులు ఒప్పుకోలేదట. ముందు తామే విచారించి దోపిడీ సొమ్మును రికవరీ చేసి ఇస్తామని సర్ది చెప్పిపంపారట. నాయుడుపేటలోని ఒక లాడ్జిలో దోపిడి జరిగినరోజు ఎ.ఆర్. కానిస్టేబుల్ పెట్టిన సంతకం, చిత్తూరు పోలీస్ ఆఫీసులో పెట్టిన సంతకంతో పోల్చి చూస్తే సరిపోయినట్టు ఝూడీ అయిపోయింది. దోపిడీకి పాల్పడిన నిందితులు వాడిన బేడీలను బట్టి జిల్లా ఎస్పీ శ్రీనివాసరెడ్డి విచారణను పోలీసు డిపార్టుమెంట్‌పైనే జరిపించగా నేరస్తులు సులభంగానే దొరికిపోయారు. ఈ దోపిడి దొంగలతో చిత్తూరులోని పలువురు

## మూడున్నర కిలోల బంగారం చోరీ వ్యవహారం!

రాజకీయ నాయకులకు సంబంధాలున్నాయట. వీరు రాష్ట్రంలో పలు చోట్ల దోపిడీకి పాల్పడినట్లు కూడా నెల్లూరు పోలీసులు అనుమానిస్తున్నారు. చిత్తూరు పోలీసులు వీరి అరెస్ట్‌కు ఒప్పుకోక పోవడాన్ని జిల్లా ఎస్పీ శ్రీనివాసరెడ్డి, గుంటూరు రేంజి డిఐజి మాలకొం డయ్యకు ఫిర్యాదు చేసినట్లు తెలిసింది. పోలీసు ఉన్నతాధికారులు తీసుకొనే నిర్ణయం మీద పోలీసు దొంగలు అరెస్ట్ అవుతారా... కేసు మరోవైపు మళ్లుతుందా అనేది తేలిపోతుంది.

## మలుపు తిరిగిన బసవాయపాళెంహత్యకేసు

కొడవలూరు మండలం బసవాయపాళెం గ్రామంలో గత నెల 5తేది హత్యకు గురైన మాచిరెడ్డి రమణారెడ్డి అతని భార్య అమరావతి కేసు పోలీసుల దర్యాప్తులో అనేక మలుపులు తిరుగుతోంది. హత్య జరిగిన మొదట్లో రమణారెడ్డి కుమారుడు జయంత్‌రెడ్డి కాంట్రాక్టు వ్యవహారాల్లో జరిగిన గొడవలు ఈ హత్యలకు కారణమని అనుమానించారు. జయంత్‌రెడ్డి కూడా పోలీసులకు సహచర కాంట్రాక్టర్ల మీదే ఫిర్యాదు చేశాడు. దీంతో పోలీసులు కొందరు కాంట్రాక్టర్లను 10 రోజులు తమ అదుపులో వుంచుకొని రకరకాల చిత్రహింసలు పెట్టినా తాము ఆ పని చేయలేదని చెప్పడంతో వారిని వదలిపెట్టేయక తప్ప లేదు. తర్వాత పోలీసులు మరో కోణం నుంచి దర్యాప్తు చేయగా ఈ హత్యలను రమణారెడ్డి సోదరుడు వెంకటేశ్వరరెడ్డి చేసినట్లు కొన్ని ఆధారాలు దొరికాయి. మృతుని ఇంటిలో వున్న సాకుడు కుక్కలను హత్య జరిగిన వారం రోజుల ముందు వెంకటేశ్వరరెడ్డి చంపినట్లు పోలీసుల దర్యాప్తులో తేలింది. ఏ విధంగా చంపాడన్న విషయం తెలుసుకొనేందుకు ఈ కుక్కల ఎముక

తొరవ 8వ పేజీలో

## ఆరవ వర్ధంతి

మా అభివృద్ధికి కారకులు

# గున్నంరెడ్డి సరోజనమ్మగారు

పరమపదించి 4.12.2000 తేదికి ఆరు సంవత్సరాలు పూర్తవుతాయి.
ఆరవ వర్ధంతి సందర్భంలో వారి పవిత్రాత్మకు శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

కుమారులు - కోడళ్లు

డాక్టర్ జి. కొండారెడ్డి, దంతవైద్యులు ... పద్మావతమ్మ
జి. రఘురామిరెడ్డి ... శ్రీనివాసమ్మ

మనుమలు - మనుమరాండ్రు

హరికిశోర్ రెడ్డి, కృష్ణకిశోర్ రెడ్డి (అమెరికా), బుదన్ మోహన్ రెడ్డి, డాక్టర్ ఎర్రంరెడ్డి ప్రసాద్ రెడ్డి, మమత

# నెల్లూరు ముచ్చట్లు

## రెండవసారి తప్పిన తుఫాన్ ముప్పు

బంగాళాఖాతంలో చెన్నైకు సమీపంలోని కడలూరు వద్ద ఏర్పడిన తుఫాను అక్కడే 29తేది తీరందాటేయడంతో జిల్లాకు రెండవసారి తుఫాన్ ముప్పు తప్పింది. అక్టోబర్ నెలలో మొదటిసారి తుఫాన్ వచ్చే అవకాశాలు కనిపించినా చివరన ఆ ప్రమాదం తప్పింది. రెండవ సారి అంతే. తుఫాన్ ప్రమాద హెచ్చరిక రాగానే జిల్లా యంత్రాంగం తీవ్రంగా స్పందించింది. తడ నుంచి తుమ్మలపెంట వరకు బంగాళా ఖాతం బకింగ్‌హామ్ కాల్వల మధ్య వున్న 12వేలకు పైగా జాలర్లను బుధవారం రాత్రి సురక్షిత ప్రాంతాలకు తరలించారు. జాయింట్ కలెక్టర్ రావత్ తడలో మకాం వేసి పరిస్థితులు సమీక్షించారు. కావలి, బోగోలు, అల్లూరు, విడవలూరు, ఇందుకూరుపేట, ముత్తుకూరు, వెంకటాచలం, మనుబోలు, చిల్లకూరు, కోట, వాకాడు, చిట్టమూరు, దొరవారిసత్రం, సూళ్లూరుపేట, తడ మండలాల ఎమ్మార్వోలకు 50వేల రూపాయల వంతున ప్రభుత్వం తక్షణ సహాయ చర్యలు చేపట్టడం కోసం విడుదల చేసింది. జిల్లా కలెకర్ ప్రవీణ్ కుమార్ 24 గంటల పాటు కలెక్టరేట్‌లో వుండి పరిస్థితులు సమీక్షించారు.

తుఫాను మూలంగా జిల్లాలో విస్తారంగా వర్షాలు పడ్డాయి. మండలాల వారిగా 29, 30తేదీల్లో కురిసిన వర్షపాతం వివరాలు దిగువ నిస్తున్నాం.

| | |
|---|---|
| కావలి | 61.6 మి.మీ |
| జలదంకి | 19.8మి.మీ |
| బోగోలు | 74.2మి.మీ |
| కోవూరు | 104.4మి.మీ |
| కొడవలూరు | 77.3మి.మీ |
| విడవలూరు | 102.4మి.మీ |
| దగదర్తి | 136మి.మీ |
| అల్లూరు | 147మి.మీ |
| బుచ్చి | 118.4మి.మీ |
| సంగం | 157.2మి.మీ |
| ఆత్మకూరు | 134మి.మీ |
| ఎ.ఎస్.పేట | 81.4మి.మీ |
| ఇందుకూరుపేట | 154.4మి.మీ |
| తోటపల్లిగూడూరు | 94.1మి.మీ |
| నెల్లూరు | 159.4మి.మీ |
| ముత్తుకూరు | 125మి.మీ |
| వెంకటాచలం | 127.8మి.మీ |
| పొదలకూరు | 99.7మి.మీ |
| చేజర్ల | 89.6మి.మీ |
| కలువాయి | 83.8మి.మీ |
| రాపూరు | 78.2మి.మీ |
| సైదాపురం | 90.2మి.మీ |
| గూడూరు | 97.4మి.మీ |
| మనుబోలు | 121.2మి.మీ |
| పెళ్లకూరు | 118.3మి.మీ |
| చిల్లకూరు | 80.2మి.మీ |
| వాకాడు | 102మి.మీ |
| కోట | 95.6మి.మీ |
| చిట్టమూరు | 148.2మి.మీ |
| నాయుడుపేట | 134.5మి.మీ |
| ఓజిలి | 75.8మి.మీ |
| సూళ్లూరుపేట | 98మి.మీ |
| దొరవారిసత్రం | 169.7మి.మీ |
| తడ | 65మి.మీ |
| వెంకటగిరి | 55.7మి.మీ |
| బాలాయపల్లి | 97.9మి.మీ |
| డక్కిలి | 70.6మి.మీ |
| సీతారామపురం | 22.1మి.మీ |
| వరికుంటపాడు | 22.6మి.మీ |
| కొండాపురం | 20.3మి.మీ |
| కలిగిరి | 29.2మి.మీ |
| వింజమూరు | 37.2మి.మీ |
| దుత్తలూరు | 50మి.మీ |
| ఉదయగిరి | 21.8మి.మీ |
| మర్రిపాడు | 53.2మి.మీ |
| అనంతసాగరం | 85.2మి.మీ |

## జిల్లాలో ఆరు ఇంజనీరింగ్ కాలేజీలు

జిల్లాలో ఆరు ఇంజనీరింగ్ కాలేజీల ఏర్పాటుకు రాష్ట్ర ప్రభుత్వం గ్రీన్‌సిగ్నల్ ఇచ్చింది. కొత్తగా ఏర్పాటు చేసే ఆరు ఇంజనీరింగ్ కాలేజీల్లో గూడూరు 2, సూళ్లూరుపేట 2, ఉదయగిరి 2 మంజూరయ్యాయి. గూడూరులో మంజూరైన రెండు ఇంజనీరింగ్ కాలేజీలు సూళ్లూరుపేట, ఉదయగిరిలలో ఒక్కొక్క కాలేజి 2001 - 2002 విద్యా సంవత్సరంలో తెరుస్తారు. మిగతా రెండు 2002 - 2003 విద్యా సంవత్సరంలో పెడతారు.

ప్రస్తుతం జిల్లాలో విద్యానగర్, నెల్లూరు, కావలిలలో ఇంజనీరింగ్ కాలేజీలున్నాయి. కొత్త వాటితో కలుపుకొంటే జిల్లాలో మొత్తం మీద తొమ్మిది ఇంజనీరింగ్ కాలేజీలున్నట్లు లెక్క.



## బార్ కౌన్సిల్ ఎన్నికలు

ఆంధ్రప్రదేశ్ బార్ కౌన్సిల్ కార్యవర్గ సభ్యులను ఎన్నుకొనేందుకు 30తేది జిల్లాలో ప్రశాంతంగా ఎన్నికలు జరిగాయి. ఎపి బార్ కౌన్సిల్‌కు 25 మంది కార్యవర్గ సభ్యులు ఎన్నిక కావాల్సి వుండగా పోటీలో 114 మంది వున్నారు. ఎప్పుడూలేని విధంగా జిల్లా నుంచి ఈ పదవుల కోసం నెల్లూరు బార్ అసోసియేషన్ ప్రస్తుత కార్యదర్శి డి.హనుమంతరావు, మాజీ కార్యదర్శులు టి.వి.రమణారెడ్డి, ఓ.అబ్బాయిరెడ్డి, కోట బార్ అసోసియేషన్ అధ్యక్షుడు పెళ్లేటి గోపాల్‌రెడ్డి పోటీ చేస్తున్నారు.

పోటీ చేస్తున్న నలుగురు నెల రోజుల నుంచి కోర్టులకు వెళ్లడం మాని రాష్ట్ర వ్యాప్తంగా ప్రచారం చేస్తూ తిరుగుతున్నారు. రాష్ట్ర వ్యాప్తంగా 38,637 మంది న్యాయవాదులు ఓటు హక్కు కల్గి వున్న ఈ ఎన్నికల్లో, ఎందరు నెల్లూరు న్యాయవాదులు గెలుస్తారనేది నాలుగు రోజుల్లో తేలిపోతుంది.

## విషాహారం తిని 40మందికి అస్వస్థత

ముత్తుకూరు మండలం తాళ్లపూడి అరుంధతీయవాడలో విషాహారం తినడంతో 40 మంది అస్వస్థులయ్యారు. అరుంధతీయవాడకు చెందిన దువ్వూరు శీనయ్య అయ్యప్పమాల ధరించి బుధవారం రాత్రి తన ఇంట్లో భజన ఏర్పాట్లు చేశారు. ఈ సందర్భంగా పులిహోర, కేసరి, వడలు, గుగ్గిళ్లు, పాయసం, బెల్లం పొంగలి వంటి తినేపదార్థాలు తయారు చేయించారు. ఇంతలో పూజలో కూర్చొని వున్న అయ్యప్ప మాల ధరించి వున్నవ్యక్తి బంధువు ఒకరు చనిపోయా డన్న సమాచారం అందడంతో స్వాములు భోజనం చేయకుండానే వెళ్లి పోయారు. చేసిన ఫలహారాలన్నీ గురువారం ఉదయం అరుంధతీయ వాడలో పంచారు. వీటిని తిన్న వారికి అరగంటలోనే వాంతులు మొదలయ్యాయి. పోలీసులకు ఈ సమాచారం అందడంతో వారు గ్రామానికి వచ్చి అస్వస్థులైన వారిని ముత్తుకూరు ప్రాథమిక ఆరోగ్యకేంద్రంలో, పరిస్థితి చేయిదాటిన వారిని నెల్లూరులోని వివిధ ఆసుపత్రుల్లో చేర్చారు. ఈ పనికి జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు సి.వి.శేషారెడ్డి, కార్యదర్శి వేణుంబాక శేషాద్రిరెడ్డి బాగా సహకరించారు. సకాలంలో గ్రామస్తులను ఆసుపత్రులకు తరలించడం వల్ల ప్రాణాపాయం తప్పింది. ఈ వ్యవహారమై ముత్తుకూరు పోలీసులు కేసు నమోదు చేశారు. వంటపాత్రలను పరీక్ష నిమిత్తం నెల్లూరుకు తరలించారు. అక్కడ పంచిన ప్రసాదాన్ని పరీక్ష నిమిత్తం గుంటూరు మెడికల్ కాలేజికి పంపినట్లు జిల్లా ఫుడ్ ఇన్స్‌పెక్టర్ మాలకొండారెడ్డి చెప్పారు.

## కెనరాబ్యాంకుపక్షోత్సవాలు

కెనరా బ్యాంకు పక్షోత్సవాలు ఈ నెల 14తేది నుంచి 29తేది వరకు జిల్లాలోని బ్యాంకు శాఖల్లో జరిగాయి. 29తేది నెల్లూరు కెనరా బ్యాంకులో జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో బ్యాంకు మేనేజర్ సుబ్రమ్మణ్యం మాట్లాడారు. నెల్లూరు కెనరా బ్యాంక్‌లో 13వేల మంది ఖాతాదారులున్నారని, 26కోట్ల డిపాజిట్లు వున్నాయన్నారు. త్వరలో బ్యాంకులో పలు కొత్త పథకాలు ప్రారంభిస్తున్నట్లు మేనేజర్ చెప్పారు.

## జేసిస్ జోన్ ప్రెసిడెంట్‌గా బోడా కిరణ్‌కుమార్

కోస్తా ఆంధ్రా, ఒరిస్సా, పశ్చిమ బెంగాల్, అస్సాం రాష్ట్రాలకు ప్రాతినిధ్యం వహించే ఇండియన్ జూనియర్ ఛాంబర్ 2001 సంవత్సరం, జోన్ నాలుగో ప్రెసిడెంట్‌గా నెల్లూరీయుడు బోడా కిరణ్‌కుమార్ ఎన్నికయ్యారు. నవంబర్ 25, 26, తేదీల్లో విశాఖపట్నంలో జరిగిన జోనల్ కాన్ఫరెన్స్‌లో ఈ ఎన్నిక జరిగింది. నెల్లూరుటౌన్ జూనియర్ ఛాంబర్ నుంచి జోన్ ప్రెసిడెంట్ పదవికి ఎన్నిక కావడం ఇదే ప్రథమం. గతంలో కిరణ్‌కుమార్ జూనియర్ ఛాంబర్ అధ్యక్షునిగా, జోన్ 4 కౌన్సిలర్‌గా, డైరక్టర్‌గా వ్యవహరించారు.

## ప్రతిరోజు మ్యూజికల్ ఫౌంటెన్ షో

చింతారెడ్డిపాళెం డొంకలో నిర్మించిన చిన్న పిల్లల పార్కులో 30తేది నుంచి మ్యూజికల్ ఫౌంటెన్ ప్రదర్శన ప్రతిరోజు సాయంత్రం 7గంటలకు వుంటుందని జిల్లా పర్యాటక అభివృద్ధి అధికారి ఎం. వెంకటరత్నం చెప్పారు. సెలవు దినాల్లో పార్కును ఉదయం 9 గంటల నుండి రాత్రి 8.30 వరకు తెరచి వుంచుతారట. పార్కును ప్రారంభించిన 14 రోజుల్లో 4,400 మంది మ్యూజికల్ ఫౌంటెన్ ప్రదర్శనను 5 రూపాయలు ప్రవేశం రుసుం చెల్లించి చూశారట. మొత్తం మీద పార్కు తెరచినప్పటి నుంచి పర్యటన శాఖకు ప్రవేశ రుసుం ఫౌంటెన్ పద్దు ద్వారా లక్ష రూపాయల ఆదాయం వచ్చినట్లుందే?

## కుసుమహరిజనవాడలో వివేకానందరెడ్డి

30తేది నెల్లూరు 9వార్డు పరిధిలోని కుసుమ హరిజనవాడలో నెల్లూరు ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి పర్యటించారు. ఈసందర్భంగా స్థానిక మహిళలు వీధి దీపాలు వెలగడంలేదని, కాల్వలు శుభ్రపరచడం లేదని, కొళాయిల్లో మంచినీరు సరిగ్గా రావడం లేదని, మట్టిరోడ్లపై నడవలేక పోతున్నామని ఎమ్మెల్యేకు ఫిర్యాదు చేశారు. చిన్న సమస్యలను మునిసిపల్ అధికారులను పరిష్కరించమని ఎమ్మెల్యే ఆదేశించారు. ఆరు నెలలలోగా కుసుమహరిజనవాడకు సిమెంటు రోడ్డు వేయిస్తానని ఎమ్మెల్యే ఈ సందర్భంగా హామీ ఇచ్చారు. పర్యటనలో ఇన్‌ఛార్జి మునిసిపల్ కమీషనర్ నారాయణరావు, డి.ఇ. అబ్బాస్ సమి, కౌన్సిలర్ పిట్ల చెంచులక్ష్మి పాల్గొన్నారు.

## మాగుంట సుబ్బరామరెడ్డి పంచమ వర్ధంతి

ఒంగోలు పార్లమెంటు మాజీ సభ్యులు మాగుంట సుబ్బరామరెడ్డి పంచమ వర్ధంతి రంగనాయకులపేటలోని రాఘవ కళ్యాణ మండపంలో 1తేది జరిగింది. సుబ్బరామరెడ్డి సోదరుడు మాజీ ఎమ్పీ మాగుంట శ్రీనివాసులురెడ్డి పూజలు నిర్వహించి సుబ్బరామరెడ్డి చిత్రపటానికి పూల మాల వేశారు. ఈ సందర్భంగా జరిగిన సభలో నెల్లూరు ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి, డిసిసి అధ్యక్షుడు సి.వి.శేషారెడ్డి, యువజన కాంగ్రెస్ జిల్లా అధ్యక్షుడు సి.ప్రవీణ్ కుమార్‌రెడ్డి, మహిళా కాంగ్రెస్ జిల్లా అధ్యక్షురాలు పందిళ్లపల్లి అరుణమ్మ, మాజీ ఎమ్మెల్యే కె.వి.సుబ్బారెడ్డి, పలువురు మున్సిపల్ కౌన్సిలర్లు, కాంగ్రెస్ నాయకులు పట్టణ ప్రముఖులు పాల్గొన్నారు. ఈ సందర్భంగా పెద్ద ఎత్తున పేదలకు అన్నదానం చేశారు.

## రామమూర్తికి పదవి

ఆంధ్ర రాష్ట్ర బాస్కెట్‌బాల్ అసోసియేషన్ ఉపాధ్యక్షునిగా నెల్లూరీయుడు పసుపులేటి రామమూర్తి ఎన్నికయ్యారు. బుధవారం గుంటూరు జె.కె.సి. కళాశాలలో రాష్ట్ర బాస్కెట్‌బాల్ అసోసియేషన్ సర్వసభ్య సమావేశంలో రామమూర్తిని ఏకగ్రీవంగా ఎన్నుకొన్నారు. రామమూర్తి ప్రస్తుతం బాస్కెట్‌బాల్



అసోసియేషన్ జిల్లా కార్యదర్శిగా పనిచేస్తున్నారు. భారత బాస్కెట్‌బాల్ ఫెడరేషన్ క్వాలిఫైడ్ రెఫరీ స్థాయిని కూడా ఇది వరకే రామమూర్తి పొందారు.

రామమూర్తి రాష్ట్ర బాస్కెట్‌బాల్ అసోసియేషన్ ఉపాధ్యక్షునిగా ఎన్నిక కావడం పట్ల జిల్లా బాస్కెట్‌బాల్ అసోసియేషన్ అధ్యక్షుడు ఆనం రామనారాయణరెడ్డి హర్షం వ్యక్తం చేశారు.

## క్రికెట్ విజేత విఆర్ కాలేజి జట్టు

నెల్లూరు పోలీస్ పేరేడ్ గ్రౌండ్‌లో పదిరోజుల పాటు జరిగి ఆదివారం ముగిసిన ఎస్వీయూనివర్శిటి అంతర్ కళాశాల క్రికెట్ పోటీల్లో ఛాంపియన్ షిప్‌ను విఆర్ కాలేజి జట్టు దక్కించుకొంది. ఫైనల్‌లో పోటీల నిర్వాహక జట్టు సర్వోదయ కాలేజిపై, విఆర్ కాలేజి ఘన విజయం సాధించింది. విజేతకు ఆనం వెంకటరెడ్డి మెమోరియల్ క్రికెట్ రోలింగ్ కప్‌ను యూనివర్శిటీ స్పోర్ట్స్ బోర్డు కార్యదర్శి బి.శారదాంబ అందజేశారు.

## దక్షిణభారత స్థాయి లారీ బిల్డింగ్ పోటీలు

నెల్లూరులో డిసెంబర్ 16, 17తేదీల్లో దక్షిణ భారత స్థాయిలో బాడీబిల్డింగ్ పోటీలు జరుగుతాయి. ఈ పోటీల్లో తమిళనాడు, కేరళ, కర్నాటక, పాండిచ్చేరి, తెలంగాణా, ఆంధ్ర ప్రాంతాలకు చెందిన 150 మంది బాడీ బిల్డర్లు పాల్గొంటారు. ఒకప్పటి బాడీ బిల్డర్, ప్రస్తుతం రాష్ట్ర క్రీడల శాఖ

తరువాయి 7వ పేజీలో

## సణుగుడు

2వ పేజీ తరువాయి

పెంచలురెడ్డికి ఎక్కడలేని ప్రాభవం వచ్చేసింది. అదృష్టం అంటే అదీ!

1983లో తెలుగుదేశంలో చేరి నప్పుడు చెన్నారెడ్డి పెంచలురెడ్డి "పదివేల" మంది కార్యకర్తలతో అట్ట హాసం సృష్టించాడు; 2000లో తిరిగి అదే పార్టీ పునః ప్రవేశానికి ఆయన వెంటవున్నది ఆరుగురు గన్‌మ్యాన్‌లు మాత్రమే! తన ప్రాభవ పతనాలకు కారణం ఏమిటో తనకే తెలుసు; ఇప్పు డైనా కారు డోరు తెరిచి, మూసే చీప్ ట్రిక్‌ల అతి వినయం మానుకొంటే ధూర్తలక్షణం లేదన్న గుర్తింపైనా వస్తుంది!

చంద్రమోహన్‌రెడ్డికి మంచి కాల క్షేపం. మంత్రి మీద ముఖ్యమంత్రి దగ్గర ఫిర్యాదు చేయడానికి ఇంత కాలం ఛాన్స్ చిక్కలేదు; ఇప్పుడూ చీపురుపుల్ల దొరికింది. దాన్ని దబ్బళంగా, గునపంగా మార్చుకొనే చాతుర్యం వుంది. ప్రభాకర రెడ్డి దీన్ని ఎట్లా ఎదుర్కొంటాడో వెండి తెర మీద తిలకించి ఆనందించడానికి వేచివుందాం! *





## పుకారు

2వ పేజీ తరువాయి

అరెస్ట్ చేయడానికి అంగీకరించలేదని తెలుస్తున్నది. ఇందులో ఎవరెవరికి ఎంతెంత వాటాలున్నాయో, బందిపోట్లను అరెస్ట్ చేస్తే ఎవరెవరి పేర్లు బయటపడ తాయోనని భయపడుతున్నారో తెలి యదు. ఎంత భ్రష్టుపట్టి పోతున్నది మన పోలీసు యంత్రాంగం? *

## నెల్లూరుముచ్చట్లు

6వ పేజీ తరువాయి

మంత్రి తమ్మినేని సీతారాం పోటీలకు జడ్జిగా వ్యవహరిస్తారు. మంత్రులు ఆదాల ప్రభాకరరెడ్డి ఆలపాటి రాజేంద్ర ప్రసాద్, ఎమ్పీ డాక్టర్ రాజేశ్వరమ్మ, ఎమ్మెల్యేలు వివేకానందరెడ్డి, రామనారా యణ రెడ్డి, జిల్లా కలెక్టర్ ప్రవీణ్‌కుమార్ ఈ కార్యక్రమాల్లో పాల్గొంటారని పోటీల ఆర్గనైజింగ్ కార్యదర్శి దువ్వూరు రాధాకృష్ణారెడ్డి చెప్పారు.

### మిస్టరీగా మిగిలిన వెంకటరత్నమ్మ హత్య

నెల్లూరు సంతపేటలోని కొండూరు వారి వీధిలో సోమవారం రాత్రి వెంకట రత్నమ్మ (39) అనే వివాహితను గుర్తు తెలియని వ్యక్తులు అతిదారుణంగా హత్య చేశారు. వెంకటరత్నమ్మ పీకకోసి ఆమె వంటి మీద వున్న 12సవర్ల బంగారాన్ని పట్టుకెళ్లారు. వెంకటరత్నమ్మ కు ఇంట్లో లోపలి వైపు గడిపెట్టి తాళం వేసుకొని వుండడం అలవాటట. ఉదయాన్నే భర్త, కుమారుడు అంగడికి పోగానే తాళం వేసుకొని, తిరిగి వాళ్లు వచ్చాకే తీస్తుందట. బాగా తెలిసిన వారు వస్తే తప్ప తలుపు పొరపాటున తీయదట. కాని సోమవారం రాత్రి 8.30 ప్రాంతంలో ఆమె భర్త మాలకొండయ్య ఇంటికి వచ్చేసరికి తలుపులు తీసేసి రక్తపుమడుగులో పడి వున్న భార్యను చూసి పోలీసులకు ఫిర్యాదు చేశాడు. ఈ దారుణానికి పాల్పడింది బాగా తెలిసిన వారై వుంటారని పోలీసుల అనుమానం. విజయవాడ నుంచి పోలీసు జాగిలాలను రప్పించారు. ఆ జాగిలం సమీపంలోని మంగలి షాపులోనికి వెళ్లి, మృతురాలి భర్త చుట్టూ తిరిగి, అక్కడ నుంచి పెన్నా నది వరకు వెళ్లి తిరిగి వచ్చేసింది. దీంతో మంగలి షాపు యజ మానితో సహా పలువురు స్థానిక దొంగ లను అదుపులోనికి తీసుకొని మూడవ పట్టణ పోలీసులు విచారిస్తు న్నారు.

### రౌడీషీటర్లకోసంవెతుకులాట

జిల్లా తోపాటు, ప్రక్క జిల్లాలో కిరాయి హత్యలకు పాల్పడుతున్న పలువురు రౌడీషీటర్లను పట్టుకొను



మాగుంట సుబ్బరామరెడ్డి పంచమ వర్ధంతి సందర్భంగా ఆయన ఫోటోకు పూలమాలవేసి నమస్కరిస్తున్న మాజీ ఎమ్పీ మాగుంట శ్రీనివాసులు రెడ్డి.

పోలీసులు దృష్టి కేంద్రీకరించి వున్నారు. ప్రముఖ రౌడీషీటర్లు సముద్రాల దావీద్, గండవరపు విజయకుమార్‌లను పట్టు కొనేందుకు పోలీసులు తెగ కష్టపడు తున్నారు. ఇద్దరూ అంత తేలిగ్గా దొరికే రౌడీలా? *

# ఉత్తరం 'తలాపి' నిద్ర- పీడ కలల ముద్ర !

ప్రాచీన వాస్తు శాస్త్రాల్లో ఉత్తరం, పశ్చిమాల వైపు తలవుంచి నిద్రించడం మంచిది కాదని నిర్ద్వంద్వంగా ప్రకటించారు.

కశ్యప, శ్రీకృష్ణ, భరద్వాజ, విశ్వామిత్ర వాస్తు శాస్త్రాల్లోనూ, భృగు సంహితలోనూ ఈ విషయమై సోదాహరణ సాదృశ్యాలు వివరించబడ్డాయి.

*దిక్పరిశీలన!*

తూర్పు ఇంద్రస్థానం ఉష్ణవాహకం, పశ్చిమం వరుణస్థానం పవన వాహకం, ఉత్తరం కుబేర స్థానం, మిశ్రిత ఋతు వాహకం, దక్షిణం యమస్థానం అయస్కాంత ప్రభావ సూచకం.

అలాగే నైరుతి, ఈశాన్య, వాయువ్య, ఆగ్నేయ స్థానాలకు ఒక్కొక్క విధమైన ప్రభావం వుంది.

*శాస్త్రజ్ఞుల వివరణ!*

పెద్దలు అనుభవపూర్వకంగా

**వాస్తుసంగతులు**
**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**

చెప్పిన అనేక విషయాల్ని వాదస్తంగా కొట్టి పారవేస్తున్నారు ఆధునికులు. మళ్లీ ఆ విషయాల్నే `నిరంతర సత్యాలుగా, నిరూపితాలుగా నిర్ధారిస్తున్నారు శాస్త్రజ్ఞులు. ఇందుకు ఎన్ని వుదాహరణలైనా చెప్పవచ్చు.

*ప్రకృతిశక్తి రహస్యాలు!*

గృహ వాస్తు ప్రకృతి శక్తి రహస్యాలకు అనుగుణంగా మలచబడింది. అందువల్లే మంచి వాస్తు మంచి ఫలితాలనిస్తున్నది.

ప్రకృతి శక్తులు మూడు అవి 1. భూమ్యాకర్షణ శక్తి 2. అయస్కాంత శక్తి 3. విద్యుత్ తరంగశక్తి.

వీటి కారణంగానే ఫలితాలేర్పడుతున్నాయి. వాస్తును పాటించిన గృహస్థులు మంచి ఫలితాల్ని పొందుతున్నారు.

*శాస్త్రజ్ఞుల పరిశోధన!*

మనుషులపై వాస్తు శాస్త్రంలో చెప్పిన దిక్ప్రభావాల గూర్చి బెంగుళూరు, మద్రాసు సాంకేతిక శాస్త్ర సమాఖ్యలు సంయుక్తంగా చేసిన పరిశోధనలో వాస్తు శాస్త్రానికి మంచి సర్టిఫికేట్ యిచ్చాయి.

*దిశల్లో గాలుల ప్రభావాలు!*

తూర్పుగాలి గుణం`లవణతత్వం' అంటే ఉప్పగా వుంటుందన్నమాట. అధిక దాహాన్ని కల్గిస్తుంది. ఈ గాలివల్ల వాతం, పైత్యం, శ్లేషం పెరుగుతాయి.

ఆగ్నేయం గాలి వేడిగా వుండి జిగటగా వుంటుంది. ఇది నేత్రాలకు మేలు చేస్తుంది. పశ్చిమం గాలి `మిశ్రమ గుణాల్ని' కలుగజేస్తుంది. ఉత్తరం గాలి శీతలగుణాన్నిస్తుంది. నైరుతి గాలి మోహతాపాలను హరిస్తుందని ప్రాచీన శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. అందువల్లే వయసు మళ్లిన లేదా యజమానుల పడక గదులు నైరుతిలో వుండాలని శాస్త్రజ్ఞులు సూచించారు.

దక్షిణపు గాలి పరమ పవిత్రమైనది. శరీర మాలిన్యాన్ని ఇది బహిష్కరింపజేస్తుంది.

*భిన్నధృవాల శక్తి!*

ఉత్తర, దక్షిణ దిశల్లో అయస్కాంత శక్తి ప్రభావం ఎక్కువ. ఆకర్షణ శక్తి, విద్యుచ్ఛక్తి ఈ దిశల్లో ఎక్కువగా ప్రవహిస్తూ వుంటాయి.

*మన శరీరం!*

మన శరీరం రక్తమాంసాదుల సమాహారమే అయినా వివిధ లవణాలు, వివిధ రసాయనాలు నిత్యం ఆవిష్కరణ, బహిష్కరణలు జరుగుతుంటాయి. ఇనుము, కోబాల్ట్, మెగ్నీషియం, భాస్వరం వంటి అనేక ధాతువులతో రక్తం నిండి వుంటుంది.

*ప్రకృతిశక్తుల ప్రభావం!*

ప్రకృతి శక్తుల ప్రభావాన్ని గుర్తించి అద్భుత చికిత్సాలయాన్ని నిర్మించాడు మానవుడు. అయిదు కోణాల `పిరమిడ్' సూర్య, చంద్ర ప్రభావాల్ని, విద్యుదయస్కాంత శక్తుల్ని సమపాళ్లలో గ్రహించి తనలో నిలవ వుంచిన ఏ పదార్థాన్నైనా చెడిపోనీదు.

ఈజిప్టు పిరమిడ్‌లలో దాదాపు నాలుగు వేల సంవత్సరాలకు పూర్వం దాచిన మమ్మీలు (శవాలు) ఈనాటికీ చెక్కు చెదరక పోవడానికి కారణం ఇదే!

అలాగే భూమికి ఉపగ్రహమై అతిచిన్న గ్రహమైన `చంద్రప్రభావం' ఈ కారణాల వల్లే పౌర్ణమి, అమావాస్యల్లో అమితంగా పనిచేస్తుంది సముద్రంపైనా, మనుషులపైనా!

*ఉత్తరం ప్రభావం!*

ఉత్తరం తలవుంచి నిద్రించడం వల్ల నిరంతర అయస్కాంత శక్తి ప్రభావం శరీరంపై పడి రక్తంలోని లవణాలు ఉత్తరం వైపు (శిరస్సువైపు) ప్రయాణిస్తాయి. అందువల్ల రక్తప్రసరణలో హెచ్చుతగ్గులు ఏర్పడుతాయి. ఫలితంగా నిద్రలేమి, కలత నిద్ర, తలనొప్పి, డిప్రెషన్ వంటి మానసిక రుగ్మతలు ఏర్పడుతాయి. గుండె, గుండె పరిసర ప్రాంతాలలోని రక్తప్రవాహ వేగంలో విపరీతమైన మార్పుల్ని బెంగుళూరు శాస్త్రజ్ఞులు పరిశోధనలో కనుగొన్నారు. ఫలితంగా గుండెలయ వేగంలో మార్పులు రావడం, శరీరం నిస్సత్తువకు గురికావడం జరుగుతుంది.

*పశ్చిమం ప్రభావం!*

పశ్చిమం తలవుంచి నిద్రపోవడం వల్ల పై విధంగానే ఫలితాలు కలుగుతాయి. అయితే వాత సంబంధమైన కీళ్లనొప్పులు, చక్కెర వ్యాధి వంటివి కలుగడానికి అవకాశం వున్నట్లు శాస్త్రవేత్తలు అంచనా వేస్తున్నారు. ఉత్తరం నుంచి దక్షిణానికీ, తూర్పు నుంచి పశ్చిమానికి విద్యుదయస్కాంత తరంగాలు నిర్విరామ ప్రయాణమే ఇందుకు కారణం.

అందువల్ల `శరీర సమస్థితికి', `రక్త తుల్యత'కి కారణభూతమైన ఎలిమెంట్లు తూర్పు, దక్షిణాల్లో వుంచిన పాదాల గుండా ప్రవేశించి విద్యుదయస్కాంత తరంగాల చేత ఉత్తర, పశ్చిమాలకు నెట్టబడి, రక్తప్రసారవేగంలో మార్పును తెచ్చి శారీరక, మానసిక రోగాలకు కారణభూతమవుతాయన్నది సారాంశం. కాబట్టి ఉత్తర, పశ్చిమాలు తలలుంచి నిద్రించరాదు. *

## దొంగపోలీసులు

5వ పేజీ కొరవ

లను పోలీసులు కెమికల్ పరీక్షల కొరకు హైదరాబాద్ పంపినట్లు తెలిసింది. ఈ కేసులో గాయపడి చికిత్స పొందుతూ రమణారెడ్డి భార్య అమరావతి మృతి చెందింది. ఆసుపత్రిలో కోలుకొంటున్న గాయత్రిని ఈ కేసు విషయమై పోలీసులు విచారించగా తాము నిద్రపోతుండగా ఈ సంఘటన జరిగిందని తానెవరినీ గుర్తుపట్టలేనని చెప్పిందట. అయితే ఉమ్మడిగా ఉన్న పొలం అమ్మకం విషయంలో సంఘటన జరిగిన కొన్ని రోజుల ముందు నాన్నకు - చిన్నాన్న మధ్య గొడవ జరిగినట్లు వివరించిందట. వెంకటేశ్వరరెడ్డికి ఇద్దరు భార్యలున్నారని, ఓ భార్య కుమార్తె పెళ్లికి పొలం అమ్మి డబ్బులిస్తానన్న రమణారెడ్డి ఇవ్వక పోవడంతో మనస్పర్థలు చోటుచేసుకొని వున్నట్లు పోలీసులు అంచనా వేస్తున్నారు. రమణారెడ్డి భార్య అమరావతి పొలం అమ్మను ఒప్పుకోక పోవడం వల్ల ఆమెను హతమార్చ ప్రయత్నించారని, సాక్షిగా నిలుస్తుందని వారి కుమార్తె గాయత్రిని కూడా చంపను ప్రయత్నించినట్లు పోలీసు వర్గాల కథనం. చివరికి ఈ కేసును పోలీసులు ఎక్కడకు తెచ్చి నిలుపుతారనేది వారం రోజులు ఆగితే తెలిపోతుంది.

## దురద

5వ పేజీ కొరవ

నామినేషన్ క్రింద ఇవ్వడానికి సిద్ధపడుతున్నారు. అధికారులు - రాజకీయ నాయకుల మధ్య ఎటువంటి లాలూచీ కుదరకుండానే 12లక్షల నిధులను స్వాహా చేసేస్తారో? జిల్లా కలెక్టర్ ఈ విషయమై విచారణకు ఆదేశించాల్సిన అవసరం ఎంతైనా వుంది.

## జిల్లా వార్తలు

5వ పేజీ కొరవ

ర్యాలీస్ ఫ్యురడాన్ గుళికలని నకిలీవి తయారు చేసేవాడు. అతను ఒక బస్తా ఒరిజినల్ ఫ్యురడాన్ గుళికలను కొని దానికి మూడు బస్తాల ఇసుకను కలిపి నాలుగు బస్తాలుగా చేసేవాడు. అనుమానం రాకుండా వుండేందుకు ఇసుకను డెమోక్రాన్ అనే మందును కలిపి ఒరిజినల్ గుళికల మాదిరిగా తయారు చేసేవాడు. ఆ గుళికలను నంద్యాలకు చెందిన ఇమాంసాహెబ్, బుచ్చికి చెందిన రత్నంరెడ్డి ద్వార బుచ్చి, నెల్లూరుకు సరఫరా చేసేవాడు. బుచ్చిలోని రామయ్య అనే రైతు నెల్లూరు రైతు డిపో దగ్గర కొన్న విత్తనాలు నకిలీవని గుర్తించి పోలీసులకు ఫిర్యాదు చేశాడు. పోలీసులు రత్నంరెడ్డిని అదుపులోకి తీసుకొని విచారించగా మిగతా విషయాలన్నీ బయట పడ్డాయి. వీరి వద్ద నున్న దాదాపు 50వేల రూపాయల విలువ చేసే 800 క్వింటాళ్ల నకిలీ గుళికలను పోలీసులు స్వాధీనం చేసుకొన్నారు. రైతులు పురుగు మందులు, ఇతరత్రా కొనుగోలు చేసేటప్పుడు నమ్మకమైన షాపులలో మాత్రమే కొనుగోలు చేయాలని నెల్లూరు రూరల్ డిఎస్పీ శ్రీనివాసులురెడ్డి చెప్పారు.



ఎస్వీ యూనివర్సిటీ అంతర్ కళాశాలల క్రికెట్ విజేత వి.ఆర్. కళాశాల జట్టు. ఫొటోలో కాలేజి ఫిజికల్ డైరెక్టర్ రవీంద్రబాబు, కోచ్‌లు శ్రీనివాసులురెడ్డి, ప్రభాకర్ రెడ్డి వున్నారు.

## సహకార రంగాన్ని సద్వినియోగంచేసుకోవాలి

సహకార రంగాన్ని మహిళలు సద్వినియోగం చేసుకొని పైకెదగాలని వవ్వేరు బ్యాంక్ కార్యదర్శి దొడ్ల రమణయ్య యాదవ్ చెప్పారు. సహకార రంగ వారోత్సవాలను పురస్కరించుకొని బుచ్చి మహిళా బ్యాంక్‌లో జరిగిన మహిళా దినోత్సవానికి ముఖ్య అతిథిగా విచ్చేసి మాట్లాడారు. జిల్లాలో సహకార రంగాన్ని ప్రోత్సహించేందుకు 10కోట్ల రూపాయలు మంజూరయ్యాయి. మహిళా సంఘాలు, స్వచ్ఛంద సంస్థలకు వివిధ రూపాల్లో సహాయం అందుతుందన్నారు. ఈ కార్యక్రమంలో నోడల్ అధికారి రాజేంద్ర ప్రసాద్, ఎమ్డీఓ వెంకట్రావ్, ఉమెన్ విడిఓ శారద తదితరులు పాల్గొన్నారు.

## బుచ్చిలో బిజెపి సైకిల్‌ర్యాలీ

బుచ్చిలో బిజెపి మైనార్టీ మోర్చా ఆధ్వర్యంలో ఆదివారం సైకిల్ ర్యాలీ జరిగింది. ఈ సందర్భంగా మైనార్టీ మోర్చా జిల్లా అధ్యక్షుడు షేక్ సుభాన్ మాట్లాడుతూ నాగపూర్ సందేశ్ ప్రేరణతో జిల్లా వ్యాప్తంగా ఈ ర్యాలీలు నిర్వహించి పార్టీలోకి దళితులను, మైనార్టీలను ఆహ్వానిస్తున్నట్లు చెప్పారు. ర్యాలీ పార్టీ కార్యాలయం వద్ద నుంచి బస్టాండ్ వరకు కొనసాగింది. ర్యాలీలో బిజెపి నాయకులు బండి మస్తానయ్య, పాతకోట రామ్మోహన్, సురేంద్రరెడ్డి, కేశవులు తదితరులు పాల్గొన్నారు.

## డిప్యూటీ డిఇఓ బ్రోకర్ యల్లాయపాళెంలో లేడు!

రెండు వారాల క్రితం జవిజ్ఞాన రైతులో `విద్యావనంలో అక్రమాల జంబూకం' శీర్షిక పేరిట వ్రాసిన వార్తకు యల్లాయపాళెం జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల సిబ్బంది వివరణ పంపారు. డిప్యూటీ డిఇఓకు బ్రోకర్‌గా పనిచేసే తెలుగు పండితుడు యల్లాయపాళెం స్కూల్‌లో ప్రస్తుతం లేడని, అతడ్ని డిప్యూటీ డిఇఓనే కొత్తూరు హైస్కూల్‌కు మార్చినట్లు చెబుతున్నారు. ప్రస్తుతం పనిచేస్తున్న తెలుగు పండితునికి ఈ లంచాల గొడవలు తెలియవంటున్నారు.

## కోడూరులో పశువైద్య శిబిరం

తోటపల్లి గూడూరు మండలం కోడూరు గ్రామంలోని సిండికేట్ బ్యాంకు శాఖ, యునైటెడ్ ఇన్సూరెన్స్ కంపెనీ సంయుక్తంగా 27తేది ఉచిత పశువైద్య శిబిరాన్ని నిర్వహించాయి. శిబిరాన్ని జిల్లా పాలడైరీ ఛైర్మన్ గోపాలకృష్ణయ్య చౌదరి ప్రారంభించారు. పశుసంవర్ధక శాఖ డిఎం శాస్త్రి, సిండికేట్ బ్యాంకు మేనేజర్ గోపాలరావు, వెటర్నరీ డాక్టర్ మురళీకృష్ణ స్థానిక రైతులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## విద్యా, వైజ్ఞానిక ప్రదర్శన

విద్యార్థినీ, విద్యార్థులలో నిగూఢమైన వున్న విజ్ఞానాన్ని వెలికితీసి వారిలో పరిజ్ఞానాన్ని పెంపొందించేందుకు విద్యా వైజ్ఞానిక ప్రదర్శనలు దోహదపడతాయని జిల్లా కలెక్టర్ కె.ప్రవీణ్‌కుమార్ చెప్పారు. 27తేది కావలిలోని సెట్ మాన్స్ ఇంగ్లీషు మీడియం స్కూల్ ఆవరణలో ఏర్పాటైన జిల్లా విద్యా, వైజ్ఞానిక ప్రదర్శనను జిల్లా కలెక్టర్ ప్రారంభించి ప్రసంగించారు. చిన్నతనం నుండి బాల బాలికల మేధస్సును పదనుపెట్టి సాంకేతిక పరిజ్ఞానం వృద్ధి చేసేందుకు సైన్సు ఉపాధ్యాయులు ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలి. నేటి కంప్యూటర్ యుగంలో శాస్త్రీయ సాంకేతిక పరిజ్ఞానం ఎంతైనా అవసరమని కలెక్టర్ పేర్కొన్నారు. మూడు రోజుల పాటు జరిగిన ఈ విద్యా వైజ్ఞానిక ప్రదర్శనలో జిల్లాలోని 144 ఉన్నత పాఠశాలకు సంబంధించిన విద్యార్థినీ విద్యార్థులు 500లకుపైగా వస్తు ప్రదర్శనలు చేశారు.

## కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు నిలిపివేత

జిల్లాలో అన్ని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు చేయడాన్ని ప్రభుత్వ డాక్టర్లు నిలిపివేశారు. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో కనీస వసతులు లేక పోవడం వల్ల ఈ నిర్ణయం తీసుకొన్నారు. నిరంతర విద్యుత్, నీటి సరఫరా, గర్భ నిర్ధారణ, ఎయిడ్స్, కామెర్లు, రక్తశాతం నిర్ధారణ సౌకర్యాలు కల్గి వుండడంతోపాటు, బాయిల్డ్ పరికరాలు, మత్తు డాక్టరుతోపాటు సర్జన్లు వుండే చోట ఈ ఆపరేషన్లు చేయాలని ప్రభుత్వ డాక్టర్ల సంఘం నిర్ణయించింది.

# పెళ్లిమాట వింటేనే వాంతివస్తోంది!

సూపర్‌స్టార్ డమ్ నుంచి ఫ్లాప్‌ల పాతాళానికి జారిపడ్డ భర్త-దాదాపుగా తనకన్నా ఇరవై సంవత్సరాలు పెద్దవాడైన ముసలి భర్తకు భార్య-గతవైభవాన్ని తలుచుకుంటూ వర్తమానంలోని పరాజయాలను జయించలేక మందుకు బానిస అయిన ముసలిభర్తను భరించే ఓ కుర్రది-ఇలా చెప్పుకుంటూ పోతే ఆమె హృదయం ఓ సముద్రంలా మనకు

## డింపుల్ వైరాగ్యం

కనిపిస్తుంది.

15ఏళ్ల పిల్లగా మొదటి సినిమా 'బాబీ'లో కనిపించిన డింపుల్, పదేళ్ల తర్వాత ఇద్దరు పిల్లల తల్లి అయినా "సాగర్"లో తిరిగి తెర జీవితాన్ని ప్రారంభించింది. సన్నీడియోల్‌తో ఆమె సాన్నిహిత్యం చాలా వరకు వెళ్లింది. ఎంతవరకంటే... సన్నీడియోల్‌తో ఇతర హీరోయిన్లు చనువు పెంచుకోవడానికి జంకే వరకు!

మగ స్నేహాలు, మందు.... భర్త నుంచి విడిపోయిన ఆమెకు సాధారణ మయ్యాయి. తోడు కోసం తపించి పోతున్నా ఆమె మళ్లీ పెళ్లి జేసుకోవచ్చు గదా! అని మీరడగ వచ్చు. మీకు ఆ అవకాశం ఇవ్వకుండా ఆమే చెప్పింది.

"పెళ్లి... మళ్లీ.... వామ్మో, గుర్తు చేసుకోవడానికే భయమేస్తోంది. ఆ పీడ కలని మళ్లీ గుర్తు చేయకండి" అని! పెళ్లిడుకెదిగిన కూతుర్ని పెట్టుకుని తానేం చేసింది? తన భర్త పెళ్లికి ముందు ఎవరెవరితోనో తిరిగితే, తాను పెళ్లయిన సన్నీడియోల్‌ని కొంగున ముడేసుకుని తిరగలేదా?-చూద్దాం తార కథకు జీవితం పలికే ముగింపేమిటో?

# యువరసిక్ 'ప్రభుదేవా'

తమిళంలో "డబుల్స్" పేరుతో విడుదలై విజయం సాధించిన ప్రభుదేవా - మీనా చిత్రాన్ని "యువరసికుడు" పేరుతో తెలుగులో విడుదల చేస్తున్నారు. తమిళ నిర్మాత కె.రాజన్ తానే తెలుగులోకి కూడా అనువదించి విడుదల చేయడం విశేషం!

వాస్తవానికి ఇది హాస్య రసప్రధాన




చిత్రం. తెలుగులో ఏవియస్ వలె తమిళంలో చక్కని కామెడీ పండించగల పాండ్యరాజన్ కథ - స్క్రీన్‌ప్లేతోపాటు దర్శకత్వం కూడా వహించి తమిళ ప్రేక్షకులను మెప్పించారు.

హాస్యరస ప్రధాన చిత్రానికి "యువరసికుడు" అని సెక్సుయిటింగ్ టైటిల్‌పెట్టి ప్రేక్షకులను మిస్‌లీడ్ చేయడం ఎంత వరకు సబబు? అని అడిగితే, నిర్మాత రాజన్ ఇలా సమాధానమిచ్చారు.

"నా మొగుడు నాకే సొంతం.... అన్నట్టుగా, కొంగున ముడేసుకొని తిరగాలనే మనస్తత్వం గల గృహిణి మీనా, నాలుగు గోడల మధ్య గోపాల కృష్ణుడైన తన భర్త వీధిలోకెళ్తే శ్రీరాముడని విశ్వసిస్తుందామె. అయితే, ఆడదాని పవిట తొలగితే చాలు వెర్రి గంగుర్లు లేచే ప్రభుదేవా అతికష్టం మీద తనని తాను నిగ్రహించుకుంటాడు. ప్రభుదేవా సతీవ్రత్యాన్ని పదిమందికీ చెప్పి మురిసిపోయే మీనాకి గుణపాఠం నేర్పాలని సంగీత విశ్వ ప్రయత్నం చేస్తుంది. అతగాడు కనిపిస్తే చాలు రెచ్చగొట్టడానికి ఎన్నెన్నో ప్రయత్నాలు.... వీధిలోకొస్తేచాలు సంగీత, ఇంటికొస్తే చాలు మీనా.... మన్మధుని బాణాలు సంధిస్తుంటారు. చిత్ర కథ మొత్తం ఆ పాయింటు చుట్టు తిరుగుతుంది. అందుకే ఆ పేరు పెట్టాం" అన్నారు.

# సింగీతం బహుభాషా చిత్రం

"ఇంటింటి రామాయణం" నుంచి "సొమ్మొకడిది - సోకొకడిది", "అమావాస్య చంద్రుడు", "పుష్పక విమానం", "దిక్కుట్ల పార్వతి", "విచిత్ర సోదరులు" - తదితర ఎన్నో చిత్రాలకు; ప్రత్యేకించి కమల్‌సొంత చిత్రాలకు దర్శకత్వం వహించిన సింగీతం శ్రీనివాసరావు ఇప్పటి వరకూ తెలుగు - కన్నడ - తమిళ - హిందీ చలన చిత్ర రంగాలలో 60 సినిమాలకు దర్శకత్వం వహించారంటే నమ్మశక్యం కాకపోవచ్చు. ఆర్టిస్టుగా కమల్ వైవిధ్యమైన పాత్రలు పోషించాలని ఏ విధంగా ఉవ్విళ్లూరతారో, దర్శకుడుగా సింగీతం అటువంటి చిత్రాలనే చేయాలని కోరుకుంటారు. అందువల్లనే అభిరుచులు కలిసిన ఆ ఇద్దరి కాంబినేషన్‌లో అన్ని చిత్రాలు వెలువడటం సాధ్యమయ్యింది. తాజాగా హిందీ - ఇంగ్లీషు - తెలుగు - తమిళ భాషలలో "లిటిల్‌జాన్" పేరుతో ఓ చిత్రాన్ని నిర్మిస్తున్నారు.

### చెన్నై ముచ్చట్లు

నిన్న మొన్నటి వరకు సర్కార్ ఎక్స్‌ప్రెస్ - రైలుని చూసినా, మద్రాసులోని పాండీ బజార్‌లోకి అడుగుపెట్టినా, టి-నగర్‌లోని ప్రతివీధి ఏదో ఒక ఆసక్తికరమైన కథ చెప్పేది. తెలుగు సినీ వైతాళికుల మధురస్మృతుల్ని నెమరు వేసేవి.

ఇప్పుడు మద్రాసు "చెన్నై"గా నామాంతరం చెందింది.

గతంలో ఎక్కడ చూసినా తెలుగు సినిమా నిర్మాతలు - సాంకేతిక నిపుణులు - కళాకారులు కనిపించేవారు. ఏ స్టూడియోలోకి అడుగుపెట్టినా ఏదో ఒక తెలుగు చిత్ర నిర్మాణం జరుగుతూ వుండేది. ఈ రోజున చెన్నైలో తెలుగు - డబ్బింగ్ సినిమాల ప్రస్తావన మాత్రమే వస్తోంది.



యువరసికుడు చిత్రంలో ప్రభుదేవా, మీనా

# భాషకు గ్రామర్-సినిమాకు గ్లామర్

ఈ రెండూ చాలా ప్రధానమైనవి ఒకప్పుడు, అంటే - 'శుభలగ్నం, మావిచిగురు, మనసులోమాట తదితర వరుస హిట్స్‌తో ఎస్వీ కృష్ణారెడ్డి - జగపతిబాబు కాంబినేషన్ ఒకప్పటి కె.వి.రెడ్డి - ఎన్టీఆర్, ఆదుర్తి - అక్కినేని, వి.మధుసూదనరావు - శోభన్‌బాబు కాంబినేషన్ వలె గ్లామర్ కాంబినేషన్ అయ్యింది. జగపతి వంటి సంస్థ "పెళ్లిపీటలు" పేరుతో ఎస్వీ కృష్ణారెడ్డి తమ సంస్థని అన్నివిధాలా ఆదుకుంటాడని ఆశించి భంగపడి, ప్రేక్షకులతో వున్న కాంబినేషన్ క్రేజీని చంపేసింది. ఈ కాంబినేషన్‌లో పెద్ద హిట్ వస్తేనే గత కాలపు వైభవం పునఃప్రతిష్ఠింపబడదు. ఈ నేపథ్యంలో ఎస్వీ కృష్ణారెడ్డి - జగపతిబాబు కాంబినేషన్‌లో "బడ్జెట్ పద్మనాభం" ప్రారంభమయ్యింది.

'క్లాప్ కొట్టిన రోజునే ఫ్లాప్' అనడం సభ్యత, సంస్కారం అనిపించుకోదు. కానీ విజయశాంతి వంటి నటితో "శ్రీ.... శ్రీమతి సత్యభామ" చిత్రాన్ని రికార్డు టైమ్‌లో ఎస్వీకృష్ణారెడ్డి పూర్తి చేసి విడుదల చేస్తే... ప్రేక్షకులు కూడా తమ వంతు కర్తవ్యంగా అంతే వేగంగా బాక్సులు త్రిప్పి పంపారు. కొంత మంది బయ్యర్లు డబ్బు కట్టి ప్రింట్స్ డెలీవరీ తీసుకోవడానికి వెనుకంజవేశారని వినికిడి. (ఎవరు అదృష్టాన్ని ఎవరు కాదనగలరు?)

అలాగే - జగపతి బాబు నటించిన "బాచి" పెద్ద ఫ్లాప్.

సత్యభామ పెద్ద ఫ్లాపా? బాచి పెద్ద ఫ్లాపా? -అని మాత్రం అడగకండి.

భాషకు గ్రామర్, సినిమాకి గ్లామర్ ముఖ్యం.

సత్యభామ - మేకింగ్‌లో 'గ్రామర్' అనే సబ్జక్టుని మర్చిపోయారు ఎస్వీకృష్ణారెడ్డి.

జగపతిబాబుకి ఒక ఇమేజ్ వుంది. ఏజ్‌కి తగ్గ వేషాలు వేస్తే గ్లామర్.

ఒక పవన్ కళ్యాణ్, ఒక వడ్డే నవీన్‌కి - పాత్రల ఎంపికలో వున్న వెసలుబాటు జగపతి బాబుకి లేదు. చిత్ర నిర్మాణ రంగంలో అపారమైన అనుభవం వున్న ఆర్ట్ డైరక్టర్ చంటి అడ్డాల - కెమరామాన్ శ్రీనివాసరెడ్డి మంచి కథని ఎన్నుకున్నారు. కానీ పాత్రకు తగ్గ హీరోని ఎంపిక చేసుకోలేక పోయారు. 'బాచి'

తరువ 11వ పేజీలో

# మౌనప్రేమతో 'చిరునవ్వుతో...'

ఎలాంటి సమస్యనైనా చిరునవ్వుతో ఎదుర్కొనే వేణు (వేణు) ఆ సమయంలో ముఖం చిన్నబుచ్చుకొని వుండటం చూచిన సంధ్య (షహీన్) "ఎందుకలావున్నావు" అని అడుగుతుంది. దానికి బదులుగా "ఐలవ్ యూ" - అంటాడు వేణు. "అదేమిటి నా వివాహం ప్రతాప్‌తో (ప్రకాష్‌రాజ్) నిశ్చయమైన ఈ శుభసమయాన కంగ్రాట్సు చెప్పకుండా ఐ లవ్ యూ అంటావేమిటి" - అని ఆశ్చర్యంగా అంటుంది సంధ్య. "అది నా మనసులోని మాట నేను నిన్ను ప్రేమిస్తున్నాను" - అంటాడు వేణు. సంధ్య నోట మాట రాలేదు. "నువ్వు నన్ను ప్రేమించడం, ప్రేమించక పోవడం అది నీ యిష్టం" అంటాడు వేణు ఖచ్చితంగా. "నేను నిన్ను ఎప్పుడూ ప్రేమించలేదు. నేను నీతో స్నేహ భావంతో మెలిగాను. మనిద్దరం జీవితాంతం స్నేహితులుగానే వుండిపోదాం" అని నిర్మలమైన మనసుతో నిదానంగా అంటుంది సంధ్య. అది విన్న తర్వాత కూడా వేణు నిర్ణయం మారలేదు. "నేను స్నేహితురాలిగా ఎప్పుడూ చూడలేదు. ఇకపైనా అలా చూడను" అంటాడు వేణు ప్రేమ పూర్వకంగా.

ప్రేమ విషయంలో సమస్య ఏర్పడుతుంది వేణుకు. ఎవరిపైనా ద్వేషం పెంచుకునే మనస్తత్వం కాదు . మనసు నిర్మలమైనది. మనసు తీసుకున్న నిర్ణయాన్ని మాటి మాటికి, మాట మాటకు మార్చుకునే తత్వం కాదు. అందుకే తన ప్రేమ విషయాన్ని నిర్మొహమాటంగా సంధ్యకు చెప్పేశాడు.

వేణు, సంధ్య మీద ఒక సన్నివేశంలో మనసు నిలుపుకుంటాడు. ప్రేమబీజం నాటుకుంటాడు. ఒక ఫైవ్




స్టార్ హోటల్లో ఉద్యోగం కోసం వేణు బస్తీకి వస్తాడు. చదువు కోసం అమెరికాలో వున్న సంధ్య తిరిగి వస్తుంది. ఒక చోట రౌడీలు సంధ్యను అల్లరిపెడుతుంటే వారి బారి నుంచి ఆమెను రక్షిస్తాడు వేణు. సంధ్య అతని పట్ల కృతజ్ఞతా భావాన్ని వెల్లడిస్తుంది. ఆమె వ్యక్తం చేసిన మృదుమధుర భావన అతన్ని ఆమె హృదయంలోకి గౌరవ పూర్వకంగా ఆహ్వానించిన భావోద్వేగం అతనిలో కలుగుతుంది. అతను ఆమెను ప్రేమిస్తాడు. ఆమె అతన్ని కలసినప్పుడంతా ప్రేమతో చూచేవాడు. ఆమె ప్రతిమాట, ప్రతికదలిక, పెదాల మీద చిరునవ్వు ఇవన్నీ తన పట్ల ఆమె ప్రేమకు ప్రతిబింబాలుగా కనిపించాయి అతనికి. తనలాగే ఆమె కూడా తనను మనసారా ప్రేమిస్తున్నదన్న అభిప్రాయం ఏర్పడింది. కాని ఆమె అతన్ని ఒక స్నేహితుడిలాగే చూచింది. అతను అంతవరకు ఎప్పుడూ తన ప్రేమను ఆమెకు వెలిబుచ్చలేదు. ఇప్పుడు తెలియపరిచాడు. ఆమెకు ప్రతాప్‌తో పెళ్లి నిశ్చయమైందని తెలిసి కూడా. వేణు, సంధ్యల మధ్య సంఘర్షణ జరగలేదు. మౌనయుద్ధం కొనసాగింది. సంధ్య సహృదయ పరిశీలనకు కఠిన పరీక్ష ఎదురైంది. అందులో ప్రేమ గొప్పదనం అర్థం వస్తుంది. చిరునవ్వుతో అపురూపమైన ప్రేమ సంపదను ఆమె వేణుకు అందిస్తుంది. అతని విచారవదనంలో చిరునవ్వు చిందిస్తుంది. ఉత్తేజమైన పతాక సన్నివేశంతో చిత్రం ముగుస్తుంది.

త్రివిక్రమ్ వ్రాసిన ఈ కథ సాధారణమైన ప్రేమ కథే. ప్రేమ అనే అంశంతో ఇప్పటికే ఎన్నో చిత్రాలు

తరువ 11వ పేజీలో

# వారఫలాలు

*2-12-2000తేది నుండి 8-12-2000తేది వరకు వృషభంలో వక్ర గురు, శనులు; మిధున రాహువు; కన్యలో కుజుడు; తులలో రవి, బుధులు ; ధనుస్సులో కేతువు; మకరంలో శుక్రుడు; మకర, కుంభ, మీన, మేషాలలో చంద్రుడు.*



### మేషం
(అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం)

ఆర్థిక ఇబ్బందులుంటాయి. అన్ని రంగాల వారికి ఆశించిన ఆదాయం రాదు. కుటుంబ ఖర్చులకు కొద్ది అప్పులు చేయవలసి రావచ్చును. కుటుంబ సౌఖ్యం ఉంటుంది. నరాలు, కంఠరాల సంబంధిత రుగ్మతలుంటాయి. విద్యార్థుల కృషి బాగుంటుంది. ఉద్యోగులు పనిభారంతో ఇబ్బంది పడతారు. వ్యాపార అవకాశాలు లభించినట్లే లభించి చేజారిపోతాయి. జరుపవలసిన పనులు కూడా నిదానంగా సాగుతాయి.

### వృషభం
(కృత్తిక2,3,4పాదాలు, రోహిణి, మృగశిర 1,2 పాదాలు)

వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో ఆదాయం బాగుంటుంది. ఆర్థిక ప్రగతికి అవకాశాలు లభిస్తాయి. ఉద్యోగులకు బాధ్యత, భారం ఎక్కువగా ఉంటుంది. అధికారుల సహకారం బాగుంటుంది. ఇతరులతో చిన్న చిన్న విభేదాలు కలిగి తొలగిపోతాయి. శుభకార్యాలలో పాల్గొంటారు. బంధువుల రాకపోకలుంటాయి. విద్యాప్రగతి బాగుంటుంది. వారాంతంలో కొద్ది అనారోగ్యం.

### మిధునం
(మృగశిర3,4పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు)

ఆదాయం ఖర్చులు సమానంగా ఉంటాయి. అదనపు గృహ ఖర్చులుంటాయి. బంధుమిత్రులతో విభేదాలు కలుగవచ్చును. రావలసిన బాకీలు నిలబడిపోతాయి. స్థిరాస్తులపై ఆదాయం బాగుంటుంది.



### కర్కాటకం
(పునర్వసు 4 పాదం, పుష్య, ఆశ్రేషలు)

కుటుంబ సమస్యలు, డబ్బు సమస్యలు కలుగవచ్చును. వృత్తి, వ్యాపార రంగాలలో కొద్ది సమన్వయం లోపించి ఇబ్బందులు కలుగవచ్చును. ఆశించిన ఆదాయం రాదు. బంధువులు, మిత్రులు సహాయపడగలరు. సొంత పనులు జరగడంలో కాలయాపన జరుగుతుంది. పలుకుబడి గల వ్యక్తులతో పరిచయాలు కల్గుతాయి. అధికారుల సహకారం పొందినా పనిభారం తగ్గదు. శుభకార్యాలలో పాల్గొంటారు.



### సింహం
(మఖ; పుబ్బ; ఉత్తర 1వ పాదం)

ప్రయాణశ్రమ, శ్వాసకోశ రుగ్మతలుంటాయి. కుటుంబంలో తగాదాలు రావచ్చును. మీ ప్రవర్తన వల్ల సన్నిహితులు దూరం కాగలరు. వృత్తి, వ్యాపార రంగాలలో లాభాలు, ఖర్చులు సమానంగా ఉంటాయి. కుటుంబ సభ్యులకు అనారోగ్యం కలుగవచ్చును. దూరదేశ ప్రయాణావకాశాలు, స్థిరాస్తులపై లాభం, రావలసిన బాకీలు, ఆశపడే రుణాలు కొంత పురోగతిని సాధిస్తాయి. కుటుంబ వ్యక్తుల వల్ల వస్తునష్టం జరుగవచ్చును. విద్యావృద్ధి బాగుంటుంది. అధికార వర్గాల సహకారం బాగుంటుంది. పెట్టుబడులపై లాభాలుంటాయి. శుభకార్యాలలో పాల్గొనడం, శుభకార్యాల నిర్ణయాలు జరుగుతాయి.



### కన్య
(ఉత్తర 2,3,4పాదాలు; హస్త;చిత్త1,2పాదాలు)

అనుకోని ఖర్చులు పైనబడి అప్పుచేయవలసి రావచ్చును. నూతన వస్తువులు కొనడం, పట్టుదల పంతాలతో నష్టపోవడం జరుగుతుంది. ఆదాయం సామాన్యంగా ఉంటుంది. గృహ, వాహన రిపేర్లు, బంధువుల రాకపోకలు, నూతన ఉద్యోగావకాశాలు, దూర ప్రయాణాలుంటాయి. ఆరోగ్యం సరిగా ఉండదు.

## పంచాంగం

ముహూర్తాలు

తేది 3 ఆదివారం ఉదయం గం10.18 లకు మకరలగ్నాన వ్యాపార ప్రారంభ, వివాహాలకు. తేది 6 బుధవారం ఉదయం గంట10.03లకు మకరలగ్నాన గృహారంభ, వ్యాపార, ఉపనయన, వివాహాలకు. తేది 7 గురువారం ఉదయం గంట 9.56లకు మకర లగ్నాన గృహారంభ, వ్యాపార, వివాహ, అన్నప్రాశనాది శుభకార్యాలకు సుమూహూర్తాలున్నాయి.

డిశంబరు తిథులు

మార్గశిర శుద్ధ

తేది 2శని షష్ఠి ప2.10గం.వ
తేది 3 ఆది సప్తమి ప4.05గం.వ
తేది 4సోమ అష్టమి సా5.30గం.వ
తేది 5మంగళ నవమి సా6.50గం.వ
తేది 6బుధ దశమి రా 7.30 గం.వ
తేది 7బేస్త ఏకాదశి రా 7.40 గం.వ
తేది 8 శుక్ర ద్వాదశి రా 7.32గం.వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ.



### తుల
(చిత్త 3,4పాదాలు, 1, 2, 3 పాదాలు)

ఆర్థిక పరిస్థితి బాగుంటుంది. వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో రాబడి పెరుగుతుంది. కుటుంబ వ్యవహారాలలో మనస్తాపం. విద్యార్థులకు మంచి ప్రగతి. కుటుంబ వ్యక్తులకు అనారోగ్యం ఉంటుంది. బంధుమిత్రుల కలయిక. శుభకార్యాలలో పాల్గొనడం, మిత్రులకు సహకార మందించడం జరుగుతుంది.



### వృశ్చికం
(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

పనులు అనుకూలంగా జరుగుతాయి. వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో బాగా శ్రమపడతారు. ఆదాయం పెరుగుదల ఉంటుంది. స్థిరాస్తుల క్రయవిక్రయాలు, పెట్టుబడి వాణిజ్య విస్తరణ అవకాశాలు లభిస్తాయి. విద్యా ప్రగతి బాగుంటుంది. కుటుంబ సౌఖ్యం బాగుంటుంది. శుభకార్యాలలో పాల్గొనడం, దూర ప్రయాణాలు బాగుంటాయి. క్రొత్త వస్తువులు కొనడం ఉంటుంది.



### ధనుస్సు
(మూల, పూర్వాషాఢ, ఉత్తారాషాఢ 1పాదం)

ఖర్చులు పెరిగి పోతాయి. ఆశించిన ఆదాయం ఉండదు. వస్తు నష్టం, వాహనాల రిపేర్లు, గృహావసరాలకు వెచ్చించడం, బాకీలు పెరగడం జరుగుతుంది. అనుకున్న పనులు నిదానంగా జరుగుట, కుటుంబ సభ్యులకు అనారోగ్యం ఉంటుంది. విద్యాప్రగతి సామాన్యం. రాజకీయ వర్గాలకు ఎదురు ఆటంకాలు వస్తాయి. శుభకార్యాలలో పాల్గొనడం, దూర ప్రయాణాలుంటాయి. అధికార వర్గం వల్ల ఉద్యోగులు బాధపడతారు. మధ్యవర్తిత్వాలు, హామీలు నెరపవద్దు. కుటుంబ సౌఖ్యం బాగుంటుంది. ఆరోగ్యం జాగ్రత్త.



### మకరం
(ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు, శ్రవణ, ధనిష్ఠ 1,2 పాదాలు)

ఆదాయం పెరుగుతుంది. కొత్త ఆర్థికపరమైన ప్రయోజనాలకై ప్రయత్నిస్తారు. కుటుంబ సభ్యుల సహకారం బాగుంటుంది. శుభకార్యాలలో పాల్గొంటారు. గృహనిర్మాణం, వాహన కొనుగోలు వంటివి ప్రారంభిస్తారు. బిడ్డల విద్యాప్రగతి బాగుంటుంది. అధికారుల ఆదరణ, ప్రభుత్వమూలక సహకారం పొందుతారు.



### కుంభం
(ధనిష్ఠ 3,4 పాదాలు, శతభిష, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

వృత్తులు, వ్యాపార రంగంలో ఆదాయం పెరుగుతుంది. వ్యవసాయ రంగంలో ఆశించిన డబ్బు లభించదు. స్థిరాస్తుల కారణంగా, డబ్బు కారణంగా తగాదాలు కలుగవచ్చును. కొత్త వస్తువులు కొనడం వల్ల ఖర్చులు, వాహన రిపేర్లు ఉంటాయి. ఉద్యోగ బాధ్యతలు పెరుగుతాయి.



### మీనం
(పూర్వాభాద్ర 4పాదం, ఉత్తరాభాద్ర, రేవతి)

అనుకున్న పనులు సవ్యంగా జరిగిన సంతృప్తి ఉంటుంది. వాహనాలు నడపడంలో జాగ్రత్త అవసరం. శ్రమకు తగిన ప్రతిఫలం పొందుతారు. కుటుంబ వృద్ధి, కొత్త వ్యాపార అవకాశాలు వస్తాయి. వ్యాపార రంగంలో ఆదాయం, రాజకీయ పట్టుదల లభిస్తుంది. దూర ప్రయాణాలుంటాయి. ఆరోగ్య పరిరక్షణ ఉంటుంది.

# జనవాణి

3వ పేజీ కొరవ

పట్టణాలు వారాణాసి (కాశి), మధుర, కృష్ణుని కాలంలో నిర్మించబడ్డ ఇంద్రప్రస్థం (నేటి ఢిల్లీ) కొన్ని ఒడిదుడుకులకు లోనవుతున్నా ఇప్పటికీ జనవాసాలుగానే వున్నాయి. మ్లేచ్ఛదేశమైన ఇటలీలో మ్లేచ్ఛుల కేసు సుమారు 3000 సంవత్సరాల క్రితం నిర్మించిన రోమ్‌నగరం ఇప్పటికీ పోప్ ద్వారా అధికారం చెలాయిస్తున్నది. గ్రీకుల పట్టణం ఏథెన్స్ పూర్వ వైభవాన్ని కోల్పోయినా ఇంకా నివాస యోగ్యంగానే వుంది. అటువంటప్పుడు సాక్షాత్తు కృష్ణ భగవానుడు దేవ శిల్పి మయుడిచేత నిర్మింపజేసిన ద్వారక వంద సంవత్సరాలలోపే దారుణంగా నాశనమయ్యిందంటే ఆశ్చర్యం కల్గుతుంది.

నెల్లూరు టి.కె.రెడ్డి

## స్పీడ్‌బ్రేకర్లు ఏర్పాటు చేయండి

బాలాజీనగర్‌లోని ఆంధ్రా బ్యాంక్ సెంటర్‌లో నాలుగు రోడ్ల కూడలివుంది. చాలా వరకు ట్రాఫిక్ టౌన్‌కు ఈ రోడ్డులోనే పోతుంది. బ్యాంక్ ప్రక్కనే డి.ఇ.ఓ ఆఫీసు కూడా వుంది కాబట్టి నిత్యం జనంతో కిటకిటలాడుతుంది. వాహనాలు స్పీడుగా రావడం టర్నింగ్ త్రిప్పేటప్పుడు పాదచారులకు ఇబ్బంది కల్గడం జరుగుతుంది. ఇప్పటికే ఎన్నో ప్రమాదాలు జరిగాయి. ఈ సెంటర్‌లో తక్షణం స్పీడ్ బ్రేకర్లు వేయించమని మనవి.

నెల్లూరు టి.వి.నారాయణ

## బడిలో పందులపెంపకం

నవాబుపేట తోటబడిలో గత పదేళ్లుగా పందుల పెంపకం జరుగుతుంది. ఇక్కడ నివాసముంటున్న పందులు జీనిగల వీధి, పప్పుల వీధి ప్రాంతాల్లో విచ్చలవిడిగా తిరుగుతూ మెదడు వాపు వ్యాధికి కారకాలవుతున్నాయి. వీటిని ఇక్కడి నుంచి తరిమివేయడానికి మున్సిపాలిటి ఎందుకు మీన, మేషాలు లెక్క పెడుతున్నదో అర్థం కావడం లేదు.

నెల్లూరు ఎం.వెంకటేశ్వరరావు

## శైవ రథాన్ని రక్షించండి

నెల్లూరు మూలపేట శివాలయంలో చెక్కతో చెక్కిన చిత్రకళా శోభితమైన రథం వుంది. ఈ రథానికి శతాబ్దాల పైబడిన చరిత్ర వుంది. తరతరాలుగా మరమ్మత్తులు జరుపుకొంటూ వస్తున్న ఈ రథానికి తీరని ద్రోహం చేస్తున్నారు. ఈ శైవరథాన్ని మొత్తంగా వేలం వేయాలని ఇటీవల ప్రకటించడం అన్యాయం. దేవాదాయశాఖ, దేవాలయాల రక్షణకే గాని భక్షణకు కాదు వుండేది. నెల్లూరులో విలువైన ఇటువంటి చారిత్రక వనరులను పురాతత్వ శాఖ రక్షించి, దేవాదాయ శాఖాధికారుల అక్రమ, దైవ ద్రోహ చర్యలను నిరోధించాలి.

నెల్లూరు జి.రామయ్య

## వెన్నెలకంటిరాఘవయ్యగార్ని మరవడం మహానేరం

శాంతినే ఆయుధంగా స్వాతంత్ర్యాన్ని మనకు సముపార్జించిన మహాత్ముడు గాంధీ, ప్రాజెక్టులు, పరిశ్రమలే దేశంలో దేవాలయాలని చెప్పి, నమ్మి స్థాపించి ఈనాడు ఆహారధాన్యాలకు లోటు లేకుండా దేశం సుభిక్షంగా వుండేట్లు చేసిన మహనీయుడు, పూజ్యుడైన జవహర్‌లాల్ నెహ్రూ, స్థిరత్వానికి చిహ్నమైన పటేల్ తదితరులను వచ్చేకాలంలో జనం మర్చిపోకుండా వుండేందుకు, వారి రూపు మస్తిష్కంలో మాసిపోకుండా చేసేందుకు విగ్రహాలను ప్రతిష్ఠించారు మన నాయకులు. అది హర్షణీయం. స్వాగతించాల్సిన విషయం. దేశంలో అక్కడక్కడా కొన్ని ఊళ్లల్లో మంచి సెంటర్లో ఒకటి అరా ఆ మహనీయుల విగ్రహాలను పెట్టడం సముచితం. అంతేకాని ఒకే ఊళ్లో అరడజను చోట్ల పెట్టడం వాళ్లను గౌరవించడం కాదు.

దీంట్లో నేను చెప్పదలచుకొన్నదేంటంటే ఆ మహనీయులతో బాటు వారికి బాసటగా దేశంలోని అన్ని ప్రాంతాలలో ఎంతో మంది స్వార్థరహితంగా, తమ ఆస్తిపాస్తులను త్యజించి, ధీరోదాత్తంగా స్వాతంత్ర్య రణకు ప్రాణాలొడ్డి పోరాడిన వారు ఎంతో మంది వున్నారు. వారిని ఆ వూర్లోనే తర్వాతితరం వాళ్లు మర్చిపోయే పరిస్థితి యేర్పడింది. ఇంటిప్రక్కన వుండే వాడి ప్రజ్ఞాపాటవాలను మనం గుర్తించం. అది మన నైజం.

ఉదాహరణకు మన నెల్లూరే తీసుకోండి. ఎంతోమంది స్వాతంత్ర్య పోరాటంలో వున్నవారు, వెంకటగిరి ఇతర జమీందారుల అరాచకాలను ఎదిరించి రైతులకు దన్నుగా నిల్చి ఉద్యమించిన వారు, ప్రత్యేకాంధ్ర కొరకు పొట్టి శ్రీరాములు గారి నిర్యాణం అప్పుడు తుపాకి కాల్పులకు గురై మరణించినవారు, జై ఆంధ్ర ఉద్యమంలో తుపాకి కాల్పులకు అసువులుబాసి వీరులైన వారు, రాజ్యాంగకర్తలు, కళాకారులు, వదాన్యులు, విద్యాదానం, వైద్యం చేసి, మానవ సేవ చేసినవారు, ఇలా ఎంతో మందిని మనం మననం చేసుకోవాల్సి వుంది. జ్ఞాపకం వుంచుకోవాల్సి వుంది. కానీ వారిలో ఒక్కరి విగ్రహాన్ని నెల్లూరు టౌన్‌లో ప్రతిష్ఠించిన పాపాన పోలేదు. పెట్టాలనే ఆలోచనకూడా ఎవ్వరికీ కల్గినట్లు కూడా లేదు.

మనవూరిలో స్ఫూర్తిప్రదాతలైన కాన్స్టిట్యూషన్ పండిట్ అల్లాడి కుప్పుస్వామి, వెన్నెలకంటి రాఘవయ్య, పొణకా కనకమ్మ, నెల్లూరు వెంకట్రామానాయుడు, ఓరుగంటి వెంకటసుబ్బయ్య, కటికనేని కళ్యాణరావు, ముత్తరాజా గోపాలరావు, అన్నారి, తూములూరు పద్మనాభయ్య, బెజవాడ గోపాలరెడ్డి, డాక్టర్ పుచ్చలపల్లి రామచంద్రారెడ్డి , తిక్కవరపు రామిరెడ్డి,బద్దెపూడి వెంకట నారాయణరెడ్డి, వాకాటి వీరారెడ్డి, ఏనుగ పట్టయ్య, నక్కా రంగనాయకమ్మ, గుద్దేటి వీరసుబ్రహ్మణ్యం, టి.వి.రమణారెడ్డి, ఇబ్రాయేల్, గురుస్వామి నాగేశ్వరరావు, ఆర్.శ్రీరాములు, పెట్లూరు గోవిందరెడ్డి, చీళ్ళ గురునాథం, కవికోకిల దువ్వూరు రామిరెడ్డి తదితరులెంతో మంది వుండగా వీరిది ఒక్క విగ్రహం కూడా జిల్లా కేంద్రంలోగాని, వారి వారి ఊళ్లలోగాని లేవు. క్రొత్తగా రాజకీయాలకు వచ్చిన వారికి గాని, పాతవారికి గాని ఈ విషయం మనస్సులోకే ఎక్కదు. ప్రజలూ అడగరు. ఇది మన దౌర్భాగ్యం.

- తూపిలి వనమాలి

## 50 ఏళ్లక్రితం

3వ పేజీ కొరవ

ఒక దశాబ్దం అసిస్టెంటు డ్రగ్ కంట్రోలర్‌గా వుండిన ఎన్.రాజమాణిక్యం గారు గత 27తేది ఛార్జి తీసుకొన్నారు.

### ప్రకాశం పక్షం

దీన్ని మేము `డెమొక్రటిక్ ఫ్రంట్' అని అనలేము. ప్రకాశం పక్షమనే అంటాము. ఈ జిల్లాలో ప్రకాశం పంతుల పక్షంలో రాఘవయ్యగారు చేరలేదు.

## నెల్లూరు సంగతులు

4వ పేజీ కొరవ

చేస్తున్నట్లు రాష్ట్ర మహిళాభివృద్ధి మరియు శిశు సంక్షేమ బోర్డు అధ్యక్షురాలు త్రిపురాన వెంకటరత్నం చెప్పారు. 25తేది రోడ్లు, భవనాల శాఖ అతిథి గృహంలో ఏర్పాటు చేసిన విలేకరుల సమావేశంలో మాట్లాడారు. 2001 సంవత్సరాన్ని మహిళా సాధికారిక సంవత్సరంగా కేంద్ర ప్రభుత్వం ప్రకటించింది. ఈ సంవత్సరంలో మహిళలపై జరుగుతున్న అత్యాచారాలు, వరకట్న దురాచారాలను రూపుమాపేందుకు విస్తృత చర్యలు వసూలు చేయాలని టార్గెట్ విధించారు. ఈ టార్గెట్ ట్రాఫిక్ పోలీసుల పాలిట వరమయ్యింది. వాహనాలను ఆపుతున్న ట్రాఫిక్ పోలీసులు వాహన చోదకుల్ని ముందు డ్రైవింగ్ లైసెన్స్, సి బుక్కులు చూపించమని అడగకుండా ఏ వ్యాపారం చేస్తున్నావని అడుగుతున్నారు. బంగారు, బియ్యం ఇతర వ్యాపారాలు పేరు చెబితే వంద రూపాయలు ఫైన్ విధించి దాన్ని జేబుల్లో వేసుకొని రసీదు ఇవ్వకుండా పంపేస్తున్నారు. ఉద్యోగస్తులైతే మాత్రం 50 రూపాయలు ఫైన్ కట్టించుకొని రసీదు ఇచ్చి వదలి పెడుతున్నారు. రశీదు ఇవ్వకుండా డబ్బులు వసూలు చేసే వ్యవహారంలో ఒక్కొక్క ఎస్‌ఐ ప్రతిదినం రెండువేల రూపాయలకు తక్కువ కాకుండా సంపాదిస్తున్నారు. సిబుక్, లైసెన్స్ లేకుండా వాహనాలు నడిపేవారికి ఆత్మకూరు బస్టాండ్ దగ్గర ఫైన్ విధించినా, తిరిగి ఆర్టీసి వద్ద ఫైన్ వసూలు చేస్తున్నారు. అదేమిటంటే ఎస్పీని వెళ్లి అడుక్కోమని ఆయన పేరు అనవసరంగా రోడ్లపైకి ఎక్కిస్తున్నారు. వాస్తవంగా ఒక వాహనదారుని రెండు చోట్ల ఫైన్ విధించడం అన్యాయం. దీనికితోడు ట్రాఫిక్ పోలీసులు రశీదులివ్వకుండా వాహనచోదకుల వద్ద డబ్బు గుంజడం ఘోరం. ఈ విషయాలను ఎస్పీ పరిశీలించి సరిదిద్దాల్సి వుంది.

### నెల్లూరులో కల్తీ టీపొడి వ్యాపారం

నెల్లూరు టౌన్‌లో కల్తీ 'టీ'పొడి వ్యాపారం జోరుగా సాగుతుంది. లీలా మహల్ సెంటర్, స్టోన్‌హౌస్‌పేట, రంగనాయకుల పేట, బాలాజీనగర్ ప్రాంతాల్లో కొంత మంది చెన్నైకు చెందిన వ్యాపారస్తులు ఈ కల్తీ టీపొడి వ్యాపారం చేస్తున్నారు. చెన్నై నుంచి నాసిరకం టీ పొడిని తెచ్చి, దాన్లో బాదంకాయ పొట్టు, బొగ్గుపొడి, చింతగింజల పొడి, రంగు వచ్చేందుకు రకరకాల రసాయనాలు కలుపుతున్నారు. ఈ విధంగా తయారు చేసిన పొడిని అందమైన ప్యాకెట్లలో ప్యాకింగ్ చేసి సైకిళ్లపై టీ దుకాణాల వద్దకు తెచ్చి అమ్ముతున్నారు. సాధారణంగా మంచి కంపెనీ టీ పొడి కేజీ ప్యాకెట్ మార్కెట్‌లో 150 రూపాయల ధర పలుకుతుండగా ఈ కల్తీ టీపొడిని కేజీ 50 రూపాయలకే ఇస్తుండడం వల్ల, పలు టీ అంగళ్ల వారు దీన్ని కొనుగోలు చేస్తున్నారు. సహజంగా ఈ 'టీ' రంగు చూస్తే తాగాలనిపిస్తుంది. కాని తాగిన తర్వాత నోరంతా వగరై పోతుంది. టౌన్‌లోని 75శాతం టీ స్టాల్స్, సినిమాహాళ్ల క్యాంటీన్లలో కల్తీ టీ పొడినే వాడుతున్నారు. ఈ టీ త్రాగడం వల్ల అల్సర్, క్యాన్సర్ వంటి రోగాలు వచ్చే అవకాశాలు ఎక్కువగా వున్నాయని డాక్టర్లు చెబుతున్నారు. మునిసిపల్ ఆరోగ్య శాఖాధికారులు ప్రతినెలా టీ బంకుల దగ్గరకు వచ్చి వందా, రెండొందలు తీసుకోవడమే గానీ కల్తీ 'టీ' తయారీదారులు, అమ్మే వ్యక్తులపై చర్యలు తీసుకోవడమే లేదు. మొత్తానికి ఉత్తేజం, ఉల్లాసం కోసమో టీ త్రాగి నెల్లూరీయులు చేతులారా రోగాలను కొని తెచ్చుకొంటున్నారు.

### ట్రాఫిక్ పోలీసుల నిలువుదోపిడీ

నెల్లూరు టౌన్‌లోని ట్రాఫిక్ పోలీసులు నిబంధనల పేరుతో ద్విచక్ర వాహనాల చోదకులు, ఆటోల వారిని నిలువు దోపిడీ చేస్తున్నారు. జిల్లా కొత్త ఎస్పీ శ్రీనివాసరెడ్డి ట్రాఫిక్‌ను క్రమబద్ధీకరించే చర్యల్లో భాగంగా లైసెన్సు లేకుండా వాహనాలు నడిపేవారిని, ఓవర్ ట్రాక్ చేసే బస్సు, ఆటోలు నడిపే వారిపై చర్యలు తీసుకోమని ట్రాఫిక్ ఎస్‌ఐలను ఆదేశించారు. టౌన్‌లోని ప్రధాన సెంటర్లయిన ఆత్మకూరు బస్టాండ్, గాంధీబొమ్మ, మద్రాస్ బస్టాండ్, ఆర్టీసి బస్టాండ్, కెవిఆర్ పెట్రోల్ బంకుల వద్ద ట్రాఫిక్ విధులు నిర్వహించే ఎస్‌ఐలు జరిమానా రూపంలో ప్రతిరోజు 2,500 రూపాయల నుంచి 3000 వరకు

### వర్ధమాన సమాజం మహాభారతోపన్యాసాలు!

వర్ధమాన సమాజం డిశంబరు 6తేది నుంచి 23తేది వరకు టౌన్‌హాల్‌లో శ్రీమంద్రాధ మహాభారతోపన్యాసాలను ఏర్పాటు చేసింది. 18రోజుల పాటు సుప్రసిద్ధ కవి, పండితులు ఒక్కోరోజు ఒక్కొక్క పర్వంపై మాట్లాడుతారు. మునుపు వర్ధమాన సమాజం మహాభారతంలోకి పాత్రలపై ఉపన్యాసాలు ఏర్పాటు చేసింది. పర్వాలపై ఉపన్యాసాలు ఇదే ప్రథమం. 6తేది ఆదిపర్వంపై పాకాల వెంకటకృష్ణయ్య, 7తేది సభా పర్వంపై వై.శ్రీపతిరెడ్డి, 8తేది అరణ్య పర్వంపై నేలనూతల శ్రీనివాసమూర్తి, 9తేది విరాటపర్వంపై మోపూరు వేణు గోపాలయ్య, 10తేది ఉద్యోగపర్వంపై గాదిరాజు సుబ్రహ్మణ్యం, 11తేది భీష్మ పర్వంపై మెట్టు రామచంద్రప్రసాద్ మాట్లాడుతారు. 12తేదిద్రోణ పర్వంపై వావిలాల జాలరామశర్మ, 13తేది కర్ణ పర్వంపై సద్దా సుందరరామిరెడ్డి, 14తేది శల్యపర్వంపై తిరుమ్మూరు సుధాకరరెడ్డి, 15తేది సౌప్తిక పర్వంపై జి.ఉమాదేవి, 16తేది స్త్రీపర్వంపై గిరిజాలక్ష్మి, 17తేది శాంతిపర్వంపై చదలవాడ వెంకటశేషయ్య ప్రసంగిస్తారు. 18తేది అనుశాసనిక పర్వంపై పాతిసెట్టి నాగరాజారావు, 19 తేది అశ్వమేథపర్వంపై అమృతవాక్కుల శేషకుమార్, 20తేది ఆశ్రమవాసపర్వంపై తిరువెంగళ రామానుజాచార్యులు, 21 తేది మౌసలపర్వంపై చీమకుర్తి వెంకటేశ్వరరావు, 22తేది మహాప్రస్థానపర్వంపై ఇలపావులూరి కామేశ్వరరావు, 23తేది స్వర్గారోహణ పర్వం కాకుటూరు వసుంధర మాట్లాడుతారు. సభాపోషకులు, ఉపన్యాసకులను సత్కరిస్తారని, సాహిత్యా అభిమానులు ఈ కార్యక్రమాలకు తరలిరమ్మంటున్నారు సమాజం అధ్యక్షుడు అగస్త్యరెడ్డి వెంకురెడ్డి.

### గాయత్రి సేవాసమాజం సమావేశం

గాయత్రి సేవా సమాజం సర్వసభ్య సమావేశం 26తేది ఆంధ్రసభ ఆవరణలో జరిగింది. ఈ సందర్భంగా కొత్త కార్యవర్గాన్ని ఎన్నుకొన్నారు. అధ్యక్షునిగా డాక్టర్ అమృతవాక్కుల శేషకుమార్, ఉపాధ్యక్షులుగా సి.హెచ్. వెంకట సుబ్బయ్య, డి.వి.సుబ్బారావు, కార్యదర్శిగా సి.హెచ్.వి. సుబ్బారావు, కార్యనిర్వాహక కార్యదర్శిగా జి.వాస్, సంయుక్త కార్యదర్శిగా పి.రమేష్‌బాబు, కోశాధికారిగా సి.హెచ్.వెంకటేశ్వరరావు ఎంపికైన వారిలో వున్నారు.

### కూచిపూడి నృత్యప్రదర్శన

సింహపురి సంగీత సభ నేతృత్వంలో డిశంబర్ 3తేది తిరుపతికి చెందిన కుమారి అచ్యుత మానస బృందంచే కూచిపూడి నృత్యప్రదర్శన జరుగుతుంది. కె.సుబ్రహ్మణ్యం నట్టువాంగం, గాత్రం కె. సూర్యనారాయణ, మృదంగం టి.ప్రభాకరరావు, వయోలిన్ పాలేటి గోవర్ధన్ నిర్వహిస్తారు. ఈ కార్యక్రమానికి సంగీత, సాహిత్యాభిమానులు హాజరు కమ్మంటున్నారు సంస్థ నిర్వాహకులు.

### వెన్నెలకంటి రాఘవయ్య 20వ వర్ధంతి

వెన్నెలకంటి రాఘవయ్య 20వ వర్ధంతి బృందావనంలో ధక్కర్ బాబా యానాది విద్యార్థుల హాస్టల్‌లో జరిగింది. న్యాయవాది ఆర్.సత్యనారాయణ, వాస్తు రామచంద్ర, ప్రత్తి సుబ్బారావు, పాట్లూరి శ్రీనివాసులు ఈ సందర్భంగా జరిగిన సభలో పాల్గొని ప్రసంగించారు. ఇక్కడి యానాది విద్యార్థులకు వాస్తు రామచంద్ర గుడ్డలు, చిరుచాపలు పంచిపెట్టారు.

## పార్కు

4వ పేజీ కొరవ

నియమించాల్సిన బాధ్యత కల్గిన పర్యాటక శాఖ ఆ పనిచేయకుండా టిక్కెట్ల ఫీజు మాత్రం వసూలు చేసుకొంటుంది. టిక్కెట్లు చెల్లుబాటు అయ్యే రోజును డిపిఆర్వో ఎందు వల్లనో టిక్కెట్లపై రాయడం లేదు. పార్కులో కట్టిన మరుగుదొడ్లు పనికి రాకుండా కట్టారు. వీటిలో లోపాన్ని అధికారులు వెంటనే సరిదిద్దాలి. మ్యూజికల్ ఫౌంటెన్ చూసే టిక్కెట్టు ఖరీదును 5 రూపాయలు పెట్టడం సామాన్య ప్రజలకు భారమే. దీన్ని రెండు రూపాయలకు తగ్గించే అంశాన్ని జిల్లా కలెక్టర్ పరిశీలించాలి. పార్కులో ఐదారు చోట్లయినా త్రాగునీటి వసతి కల్పించాలి. లైటింగ్ వసతులను మరింత మెరుగుపర్చాలి. టిక్కెట్ల 'క్యూ' స్త్రీ, పురుషులకు వేరు వేరుగా పెట్టాలి. పార్కును తీసివుంచే వేళలు కూడా ప్రజలకు అందుబాటులో లేవు. సాయంత్రం 4 గంటల నుంచి రాత్రి 9.30 గంటల వరకైనా వీటిని పొడిగించాలి. అదే విధంగా టిక్కెట్లు ఇచ్చే గడువు కూడా రాత్రి 8.30 వరకు వుండేలా చర్యలు తీసుకోవాలి. ఈ విధంగా వుంటేనే పట్టణ ప్రజలు సాయంత్రవేళ నింపాదిగా పార్కుకు రాగలుగుతారు. పార్కు వద్ద శని, ఆది వారాల్లో ప్రత్యేకంగా పోలీసులను నియమించాలి. అన్నింటికన్నా ముఖ్యం పార్కు నిర్వహణ బాధ్యతలు చూసే సిబ్బందిని వెంటనే నియమించడం. ఆ పని వెనువెంటనే చేయకుంటే పార్కు ధ్వంసమై, మూతపడి పోవడం ఖాయం.

## విచారణ

4వ పేజీ కొరవ

ఉద్యోగాలిస్తామని కొందరి వద్ద డబ్బులు వసూలు చేసుకొని వుండడం వల్ల నియామకాల లిస్టు జారీ చేయను మీనమేషాలు లెక్కపెడుతున్నట్లు తెలిసింది. జిల్లా కలెక్టర్ ఈ వ్యవహారాన్ని ఒకసారి పరిశీలిస్తే, మెరిట్ వున్న నిరుద్యోగులకు న్యాయం జరుగుతుంది.

## అమ్మాయిలు

4వ పేజీ కొరవ

ముంబై, హైదరాబాద్, మద్రాస్‌లోని వ్యభిచార వాడలకు తరలించేవారట. ఈ ఊబిలో చిక్కుకొన్న బాలికను తాను హైదరాబాద్‌లో సినీనటి సంయుక్త యింటిలో వుంచినట్లు చెప్తున్నా పోలీసులు మాత్రం ఆమెనొదలి మిగతా 8 మందిపై కేసు నమోదు చేశారు.

ఇటీవల బుజబుజనెల్లూరుకు చెందిన జులేఖా, సుబ్బరత్నమ్మ అనే మహిళలు ఈ ప్రాంతానికి చెందిన నిరుపేద యువతి సుల్తానాను ఉద్యోగం ఇప్పిస్తామని తమ ట్రాక్‌లోకి తెచ్చుకొన్నారు. సినిమాలకు, బట్టల షాపులకు తీసుకెళ్తూ ఒకరోజు మత్తు మందు కలిపిన ఆహారం తినిపించి ఆ యువతితో బలవంతంగా వ్యభిచారం చేయించారు. ఆ తర్వాత ఆమెను రహస్యంగా మద్రాసులోని వ్యభిచారపు కొంపకు తరలించారు. సుల్తానా తల్లిదండ్రులు పోలీసులకు ఫిర్యాదు చేసిన పిమ్మట జరిపిన లోతు దర్యాప్తులో ఈ గుట్టంతా రట్టయ్యింది.

## చిత్రసమీక్ష

9వ పేజీ కొరవ

వచ్చినా దర్శకుడు రాంప్రసాద్ ఈ ప్రేమ కథను కొత్తకోణంలో రూపుదిద్దాడు. దర్శకుడు బి.గోపాల్ వద్ద సహాయ దర్శకుడుగా పని చేసిన రాంప్రసాద్‌కు ఇది తొలి చిత్రమైనా గురువుకు తగ్గ శిష్యుడనిపించుకున్నాడు. చిత్రం మొదటి భాగంలో కనిపించే ప్రేమను, వినోదాన్ని దర్శకుడు ఆనందమయం చేశాడు. చిరునవ్వులతో సందడి చేశాడు. ప్రేమ, స్నేహం మధ్య ఏర్పడిన చిక్కు ముడి ఏర్పడిపొరపొచ్చాలతో ఇమిడిన చిత్రం రెండవ భాగాన్ని పట్టుసడలకుండా పట్టుకొచ్చాడు దర్శకుడు. స్క్రీన్‌ప్లే బిగువుగా ఏర్పడింది. రాంప్రసాద్ ప్రథమ ప్రయత్నం విజయవంతమైంది. త్రివిక్రమ్ మాటలు పాత్రోచితంగా చక్కగా కుదిరాయి. మణిశర్మ సంగీతం నులివెచ్చని పారవశ్యాన్ని కల్గిస్తుంది.

'స్వయంవరం' చిత్రం తర్వాత వేణుకు ఇది రెండవ చిత్రం. చిరునవ్వును, విచారాన్ని మెప్పించాడు. షహీన్‌కు ఇది తొలిప్రయత్నం. తొణికిసలాడకుండా నటించింది. ప్రకాష్‌రాజ్ తన ద్వంద్వార్థపు మాటలతో భేష్ అనిపించాడు. బ్రహ్మానందం, ఎల్.బి.శ్రీరాం బాగా నవ్వించారు. చిత్రం ఆనందంలో ముంచెత్తుతుంది.

## సినిమా

9వ పేజీ కొరవ

కథా నాయిక నీలాంబరి పాట చిత్రీకరణలో చక్కని స్టెప్స్ వేసింది. ఒకనాటి ఎమ్జీఆర్, ఎన్టీఆర్ వలె నిలదొక్కుకోవడానికి (పాటల చిత్రీకరణలో) జగపతిబాబు చేసిన ఫీట్స్ ఫ్లాప్ అయ్యాయి.

ఏమయితేనేం, ఎస్వీకృష్ణారెడ్డికి "శ్రీ.... శ్రీమతి సత్యభామ", జగపతిబాబుకి "బాచి" - రెండూ చేదు అనుభవాలను మిగిల్చాయి. ఈ నేపథ్యంలో వీరిద్దరి కాంబినేషన్‌లో "బడ్జెట్ పద్మనాభం" ఎస్వీ కృష్ణారెడ్డి శైలిలో చకచకా షూటింగు జరుపుకుంటుంది. ఈ ప్రాజెక్టుకి మూడు ప్లస్ పాయింట్లున్నాయి. వీరిద్దరి కాంబినేషన్‌లో వచ్చిన "నర్తుకుపోదాం... రండి" ఏవరేజ్‌గా ఆడి ఇటు ప్రేక్షకుల్ని, అటు కొనుగోలు దార్లని నిరాశపరచలేదు.

### ఎవరికీ పట్టని సినిమా

ఈ మధ్య విడుదలైన సినిమాలలో "దేవుళ్లు" అద్భుతంగా వుందని చిత్రపరిశ్రమ సర్టిఫికెట్ ఇచ్చింది. ప్రత్యేకించి అయ్యప్పపాట; రాజేంద్రప్రసాద్ పాట అద్భుతమని చూసినవారు అంటున్నారు. తెలుగు సినీపరిశ్రమలోని పలువురు అగ్రతారలు ఈ చిత్రంలో అతిథిపాత్రలు పోషించడం విశేషం. 1999 డిసెంబరులో పాటల రికార్డింగ్‌తో ప్రారంభమైన ఈ చిత్రం పదకొండు నెలల తర్వాత - 2000 నవంబరులో విడుదలయ్యింది. అగ్రతారాగణం వుంది. పాటల హిట్. గ్రాఫిక్స్ సూపర్బ్. ఎక్కడా నెగటివ్ టాక్ లేదు. కానీ థియేటర్లో జనం లేరు. ఈ విషయమై ఓ చిత్ర ప్రముఖుని స్పందన. "చిత్రం, బ్యాచిలర్స్ హిట్ కావడంతో దాదాపుగా ఇరవై చిన్న చిత్రాలు ప్రారంభమయ్యాయి. 'దేవుళ్లు" హిట్ అయివుంటే క్వాలిటీ కాన్షస్ పెరిగేది - మరో డజను చిత్రాలు ప్రారంభమై వుండేవి. అయితే ఎర్రజెండాల సినిమాలు తెలంగాణాకే పరిమితమయినట్లు ఈ "దేవుళ్లు" సినిమా ఆస్తికుల సినిమాగా మిగిలిపోయి ఎవరికీ పట్టని సినిమా అయ్యింది"

ఈ వ్యాఖ్యని సమర్థించలేం. కారణం: అమ్మోరు, మా అమ్మ దుర్గమ్మ చిత్రాల విజయాన్ని ఎలా విస్మరించగలం?

### హరీష్ "మౌనదాహం"

మలయాళంలో, కన్నడంలో శృంగార పరమైన చిత్రాల నిర్మాణం ముమ్మరంగా సాగుతోంది. ప్రముఖ నిర్మాణ సంస్థలు సైతం, పెద్ద హీరోలతో భారీ బడ్జెట్ చిత్రాలు చేస్తూ - ఒక చిత్రానికి మరో చిత్రానికి మధ్య కాలంలో ఆ యూనిట్‌లో పనిచేసే అసోసియేట్ డైరక్టర్ని డైరక్టర్‌గా ప్రమోట్ చేసి, నిర్మాణ సంస్థ పేరు మార్చి సెక్స్ ప్రధానాంశంగా సినిమాలు తీయడం ప్రారంభించారు. లోబడ్జెట్‌లో తీసే ఈ చిత్రాల వల్ల ఆఫీసు వ్యయం కలిసొస్తుంది. యూనిట్‌కి ఫీడింగ్ లభిస్తుంది. ఆ కోవలో నిర్మింపబడిన చిత్రమే ఇది.

* * *

Registered : RN 1156 / 57

No. A.P. / VJA / 52 / 8 / 2000

ZAMINRYOT WEEKLY - NELLORE

1.12.2000



## పంచాయతీ

మొదటి పేజీ కొరవ

జరపకుంటే కోర్టు కినుక వహిస్తుందన్న వెరపు - ముందు కొస్తే నుయ్యి, వెనక్కు తిరిగితే గొయ్యి - పాపం చంద్రబాబు, పంచాయతీల ఉచ్చులో చిక్కుక పోయారు.

ఇందులో నుంచి బయటపడేదా రేది? గోదావరి వరదలో మునిగే ప్రమాదంలో ఈదడానికి కుక్కతోక ఊతం దొరికినట్లు - జనాభాలెక్కల సేకరణ కన్పిస్తున్నది! అది రాజ్యాంగ నియమానుసారం జరిగే కార్యక్రమమే. దాని నిబంధన ప్రకారం మార్చి 31తేది వరకు ఎటువంటి ఎన్నికలు జరిపించ డానికి లేదు. ఆ కుంటి సాకు అడ్డం చెప్పబోతే - డిసెంబరు నెలాఖరులోగా ఎన్నికల తతంగం పూర్తి చేయమని కాంగ్రెస్‌పార్టీ వత్తిడి చేస్తున్నది. వారి సవాల్‌ను స్వీకరించే సాహసం తెలుగు దేశం పార్టీకి లేదు; తిరస్కరిస్తే ఓటమి భయంతో పారిపోయారని గేలిచేస్తారన్న సందేహం!

నిజానికి కాంగ్రెస్ కంటే తొందర లోవున్నారు తెలుగుదేశం అసమ్మతి వాదులు. ద్వితీయ మంత్రివర్గ విస్తరణ లోనూ తమకు పిలుపు రాకపోవడంతో చంద్రబాబు పట్ల పూర్తిగా విరక్తి చెందిన తెలుగు నేతల సంఖ్య బలపడిపోయింది. తమ కక్ష తీర్చుకొనేందుకు పంచాయతీ ఎన్నికలకంటే మంచి అదను వీరికి వేరొకటి దొరకదు. వీటిలో పార్టీని పరాభవిస్తే ముఖ్యమంత్రి నియంతృత్వం నీరుగారి పోతుందని, తమ వంటి వారిని కలుపుకపోక తప్పని స్థితి ఏర్పడుతుందని వీరి వెర్రి ఆశ. అది నిజం కూడా! స్థానిక ఎన్నికల ఓటమి, స్థానానికి పరిమితం కాదు; ప్రభుత్వ స్థిరత్వంపై ప్రభావం చూపి తీరుతుంది. ఇటు రాష్ట్రంలో, అటు ఢిల్లీ మిత్రుల దగ్గర చంద్రబాబు మకుటంలేని మహారాజా. ఆ మకుటం ఒకసారి జారిక్రింద పడిందంటే - తిరిగి కోలుకోవడం కష్టం. మండలాలు, జిల్లా పరిషత్ కాంగ్రెస్ చేతికి చిక్కితే ప్రభుత్వం నడవడం చిన్న పని కాదు. ఎమ్మెల్యేలు తమ్మిలై పోతారు. మంత్రులకు నిత్యం ఘర్షణ తప్పదు... మధ్యలో అధికార్లు నలిగి పోతారు. ఎవరికీ మనశ్శాంతి వుండదు.

దీనికి తరుణోపాయం - ఎన్నికల వాయిదా ఒక్కటే. చాలా సున్నితమైన సమస్య! కోర్టుకు ఆగ్రహం కల్గకుండా ప్రజలలో పిరికివాడు అనే అభిప్రాయం ఏర్పడకుండా ఈ చిక్కు ముడివిప్ప డానికి కసరత్తు చేస్తున్నాడు ముఖ్య మంత్రి. ఈ వారంలో అసెంబ్లీని సమావేశపరచి, జిప నియోజక వర్గాల పరిధిని పెంచే బిల్లు మంజూరు చేయిం చడం ఆ ఉపాయాలలో ఒకటి! అట్లా చేస్తే ఎవరో ఒకరు కోర్టుకు వెళ్తారు. ఎన్నికలపై స్టే తెస్తారు అని ఒక అంచనా. కాని న్యాయనిపుణులు దీన్ని ఒప్పుకోవడం లేదు. సుప్రీంకోర్టు అంత కఠినమైన ఉత్తర్వులు ఇచ్చిన తర్వాత, ఇందులో వేలు పెట్టడానికి హైకోర్టు సమ్మతించదని వారి అభిప్రాయం. పైగా పంచాయతీల చట్టంలో మార్పు, చేర్పులు అంత త్వరగా జరపడం అసంభవం. సెన్సస్ నిబంధనలు తెల్పి, ఏప్రిల్ తర్వాత వరకు వ్యవధి కోరుతూ సుప్రీం కోర్టునే అనుమతి అడగడం మరొక మార్గాంతరం. అయితే ఏప్రిల్, మే నెలలో గ్రామాలలో మరీ భయంకరంగా వుంద బోతాయి. కరెంట్, నీళ్లు రెండూ వుండని గడ్డురోజులవి. అప్పుడు ఓట్లు అడిగితే పులినోట్లో తల పెట్టడమే అవుతుంది. బిసి రిజర్వేషన్ల విషయంలోని గందర గోళం ద్వారా హైకోర్టు ఆసరా దొరుకు తుందా అని కూడా అన్వేషిస్తున్నారు.

చంద్రబాబు రాజకీయ సమర్థతకు పెద్ద పరీక్ష ఇది. ఈ ఉచ్చు తప్పించు కోవడానికి ఆయన ఏ ఎత్తు ఎత్తుతాడో, ఏ పాచిక విసురుతాడో వేచి చూడవల సిందే! *

## అవినీతి

మొదటి పేజీ కొరవ

వడ్లకు సరైన ధర రాక, తగ్గించి అమ్ముదామన్నా కొనే దిక్కులేక రైతాంగం చేస్తున్న ఆక్రందనలు యావత్ ఆంధ్ర దేశంలో ప్రకంపనలు సృష్టిస్తుంటే - మద్దతు ధర రావడం లేదని ఎవడు చెప్పింది - అని దబాయించాడు మంత్రి డాక్టర్ ఎన్.జనార్ధనరెడ్డి. గతంలో మహబూబ్‌నగర్ ఆకలిచావులు, రైతుల ఆత్మహత్యల మీద సైతం ఆయన హేళనా పూర్వక వ్యాఖ్యలు చేశాడు. వళ్లు పొగరెక్కి వాగుతున్న ఈ ప్రబుద్ధుడికి ఎప్పుడో రైతుల చేతిలోనే బుద్ధి నేర్పించుకొనే రోజు రాక తప్పదు.

వీటి సంగతి ప్రక్కన పెడితే - లంచాలు తినే మంత్రులకు మరి ఆరు నెలలు సమయం ఇస్తున్నానని క్యాబినెట్ మీటింగులో ప్రకటించి, ఆ తర్వాత నాలుక కరుచుకున్నాడు సాక్షాత్తు ముఖ్యమంత్రి. కొందరు మంత్రులు పబ్లిక్‌గా పైలుకు ఇంత అని రేటు పెట్టి మరీ దండుతున్నారని; పిఎలు, పిఎస్‌ల ద్వారా తమ పేషీలనే లంచాల దండక కేంద్రాలుగా మార్చిపారేశారని దినప త్రికలు రుజువులతో సహా సీరియల్ వార్తలు ప్రకటిస్తే వారిపై చర్య తీసుకో వలసింది పోయి, మరి ఆరు నెలలు వ్యవధి ఇస్తున్నాను అని చెప్పడంలో అర్థం ఏమిటి? మంత్రుల అవినీతికి ముఖ్యమంత్రే ఆమోద ముద్ర వేయడమే కదా? ఆయనలో ఎందుకి బలహీనత?

తెలుగుదేశం ప్రభుత్వం ఏ దారిలో నడుస్తున్నదో, ఎంతటి పాపాలు మూట కట్టు కుంటున్నదో తెలుసుకోవడానికి చిన్న రుజువు - ఈ ప్రకటనలు, ఖండనలు. ప్రజలకు తాము చేయగల్గింది ఏదీ లేదని తెలిపోవడంలో, తమ స్వంత ఇళ్లు చక్కదిద్దుకొనే పనిలో నిమగ్నమై పోయారు మంత్రులు. ముఖ్యమంత్రి కుంభస్థలం కొడుతుంటే, మంత్రులు నైవేద్యాలు ఆరగిస్తున్నారు. ప్రభుత్వ పాలన, ప్రజల సంక్షేమం మాటల వరకే; ఎవరి చిన్ని పొట్టలే వారికి శ్రీరామ రక్ష! *



కునుము హరిజనవాడలో మంచినీటి కొళాయి వద్ద పరిస్థితులు పరిశీలిస్తున్న ఎమ్మెల్యే వివేకానందరెడ్డి.